# హాస్యలహరి



రెంటాల - వేంకటసుబ్బారావు పంతులుగారిచే

రచియింపఁబడినది.



విక్టోరియా డిపో - మైలాపూరు - మద్రాసు.

1910



పై నెక్కి-పోటు పొడిచితిని. నా యదృష్టమని యెన్నవలయును - అది యాపోటు రుచిచూచి నతోడనే తోరటపై కెగప్రాకి పారిపోయెను. నేనును దానితోక పట్టుకొని చెట్టుపై కెక్కి మెల్లగ దిగిపోయి యిల్లుచేరితిని.

సు॥ ఓహో! ఎంత ఆశ్చర్యము! ఎలుగుబంటికి తోకయుండుట యింతకు ముందెన్నడును నేను వినికని యెరుగను.

సా॥ నేనుగూడ అంతకుముం దెన్నడును కనియెరుగను.

సు॥ ఓహో! ఎంత ఆశ్చర్యము!

---

## ప్రియుడు - ప్రియురాలు.

చం॥ తిలకముమాసె ముంగురులతీరు దొలంగెఁ గతంబదే
చ్చెలి! నిదురందునుంటెఁజిఱుచెమ్మటలబ్బెను-కంచుకంబొ
జలకము లాడుదుర్గ— పరవశత్వమదేల ?— మిముం గసంగ
బలెబలె! బొంకులాడి! మధుపానవికారమదెట్లుదాచెదే



## - లాయరుగారు — పల్లెటూరికాపు.

ఒకనాటి యుదయమున ఒకపల్లెటూరికాపు లాయరుగారి ఆఫీసులోనికి పోయి - అయ్యా, ఒకసందేహములో తగులుకొని నామనస్సు చాలసంకటపడుచున్నది. తమ సలహానిమిత్తమిచ్చుటకి వచ్చితిని — అని వినయపూర్వకముగా మనవిచేసికొనియెను. ఏమిటా విషయమని లాయరుగారు ప్రశ్న వేసెను.

ఒకని భూమిమీదుగ ఇంకొకరి భూమిమీదికి నీటికాల్వ పారుచుండును. పైభూమిఖామందు తనపొలములో పెద్దచెరువు త్రవ్వించి దాని నిండ నీరు నింపుటవలన క్రిందివాని పొలమునకు తరుణములో చాలినంత నీరు రాక పంట చెడిపోవును. దీనికి ఈ క్రింది పొలముఆసామి ఆ పై పొలము ఆసామిమీద దావా తెచ్చి నష్టముపొంద వచ్చునా? — అని కాపువా డడిగెను.

లాయరుగారు సంతోషముఖముతో—సందేహమేమిటి? దావా తక్షణము దాఖలుచేయుదును. పూర్తానష్టము వసూలుచేయుదును. దీని లా మనప్రక్కనున్నది. నిశ్చింతగానుండు—మని చెప్పెను.

కాపువాడు బిక్కమొగముదాల్చి — తాళుతాళండి! ఆ చె త్రవ్వించినవాడే నేను. నా పొలమునకు క్రిందనుండుపొలము ఖామం నామీద వ్యాజ్యము వేయుదునని బెదరించుచున్నాడు. నాకేమియు దోచకున్నది—అని మొరపెట్టుకొనెను.

లాయరుగారు ఒక్కింత తడవు కన్నులుమూసికొని ఆలోచించి— అయితే చెరువు త్రవ్వించితినని చెప్పితివిగదా, అది యెందుకొఱ త్రవ్వించిన చెరువు? చుట్టుప్రక్క జనుల ఉపయోగము నిమిత్తమ త్రవ్వించినదా?—అని ప్రశ్న వేసెను.

కాపువాడు కొంచెము ప్రాణమువచ్చి—ఔనండి. వేసవికాలము నీట్టులేక చుట్టుపట్టు గ్రామములవారు చాల కష్టపడుచున్నారం నాపొలములో నాలుగు యకరములు మా నాయనగారిపేర ధర్మము ఏర్పరచి దానిలో ఈ చెరువు త్రవ్వించితినండి - అని చెప్పుకొనెను.

లా॥ ఓ! దట్ సాల్ రైట్. ఇప్పుడు అందరును ఆ చెరువులో యుదకమేగదా ఉపయోగపరచు చున్నారు?

కా॥ ఔనండి.

లా॥ ఎంతమాత్రము భయపడవద్దు. తేసి, వ్యాజ్యము తేసి, ఖర్చు తోగూడ మనపక్షము చేయింతును.

కాపువాడు సంతోషముతో నింటికిపోయెను.

---

## కుప్పన్న.

జడ్జి శ్రీనివాసరావుగారు చాలా మంచివారు సిగర్వశిరోమణులని వడసియుండిరి. ఒకనాటిరాత్రి ఆయన పారసీ నాటకమును చూడ ఫస్టుక్లాసు టిక్కట్టు పుచ్చుకొని మొదటి వరుస కుర్చీలలో నొకట గూర్చుండి చూచుచుండెను. అప్పుడు అదేవరుసలో కొంతదూ గూర్చుండిన యొక పడుచువాడు మంచి విలువదుస్తులు ధరించి టయు తనను మాటిమాటికి జూచుచుండుటయు గని తాను మ

వాఁడుగ నిశ్చయించికొని అతడెవరో జ్ఞాపకము తెచ్చుకొనజాలక పలుక రించకున్న బాగుండదని తలచి ఆసనమువిరామము గల్గినప్పుడు అతని చెంతకుజని - నాయనా! బాగున్నావా? నిన్ను మున్ను చక్కగ నెఱిగి యుంటిని. కాని పెద్దతనముచే జ్ఞాపకము చాలకున్నది — అని జడ్జిగారు దరణపూర్వకముగా చేయిసాచెను. కుశాలుగాఁడు కలవరపడి — అవును బాబూ! నన్నెఱుగరా? నేను కుప్పన్నే — అని బదులుచెప్పెను. కుప్పఁడు మున్ను తనవద్ద నౌకరిచేసిన వంటవాఁడని జ్ఞప్తికివచ్చి, జడ్జీగారు మాఱుపలుకక చల్లగ తనస్థలమునకు చేరుకొనిరి.

---

## గంగెద్దువలన తగవుతీఱుట.

ఒక కమ్మసంసారికి ముగ్గురు కుమారులుండిరి. అతఁడు మృతిచెందుచు తనకుగల 19 యెద్దులను తనకుమారుల నీవిధమున పంచుకొమ్మని చెప్పి పోయెను — పెద్దవానికి తనయెద్దులలో సగభాగము. రెండవవానికి నాల్గింట నొకపాలు; మూడవవానికి అయిదింట నొకపాలు. ఈ భాగములు తెగనందున వారు ముగ్గురును తగవులాడుకొనుచుండిరి. ఆ తగవు తీర్చుట యెవ్వరికిని సాధ్యముకాకపోయెను. అప్పుడా దారిని పోవుచున్న యొక గంగెద్దుబిచ్చగాఁడు వారితగవు నిముషములో తీరుమా నించెను. చాలా విచిత్రము! అది యెట్లనగా —

"బాబులారా! యీ యెద్దులభాగ్యమునకు మీరింత పోట్లాడుకొన వలెనా? నేను మీతగవుతీర్చెద చూడుండి" అని, పెద్దవానిని గని, తండ్రీ! నీభాగమెంతయని యడిగెను. జవాబు — "సగము."

నీదెంతయని రెండవవాని నడిగెను. "నాల్గింట నొకపాలు."

నీదెంతయని మూడవవాని నడిగెను. "అయిదింట నొకపాలు."

"ఔరా! యీ భాగములు తెగజాలవే! ఏమిచేయుదుము? బాబు లారా! నా బక్క యెద్దునుగూడ తీసికొని భాగములు పంచుకొనుడు" అని తన గంగెద్దును వారి 19 యెద్దులలో జేర్చెను. వారును సంతో షించిరి. అంతట పెద్దవాఁడు తనవంతు 10 యెద్దులను రెండవవాఁడు తన వంతు 5 యెద్దులను, మూడవవాఁడు తనవంతు 4 యెద్దులను తీసికొనిరి. అప్పుడు గంగెద్దు మిగులగా బిచ్చగాఁడు తోలుకొని తనదారి నిపోయెను.

## గృహ నామములు.

ప్రస్తుతము రాజమహేంద్రవరమునందలి ట్రెయినింగుకాలేజి ప్రిన్సిపల్‌గానుండు మల్లాది వేంకటరత్నము, బి. ఏ., గారు కొంతకాల క్రింద సైదాపేట టీచర్సుకాలేజిలో నుపన్యాస మిచ్చుచు భోజన విష మైన పదార్థములను కార్యములను ఆంధ్రదేశస్థులు సఖ్యతతో తమ నామము పంచుకొని వేర్వేరుగ నెరవేర్చుచుండునట్లు సెలవిచ్చి, యు హాణ పూర్వజముగా — చిప్పలవారు, చేబియ్యంవారు, నూకలవా మెతుకులవారు, పప్పువారు, నేతివారు, జిడ్డువారు, చల్లావారు, కం వారు, మిరియాలవారు, ఇంగువవారు, పచ్చిపులుసువారు, అతిరస వారు, రొట్టెలవారు - ఇట్టి గృహనామములు గల కుటుంబములు కల తెలుపుటయేగాక, వండిన పదార్థములను కలుపుకొనుటయు మ్రిం టయు పిమ్మట మంచినీళ్లు త్రాగుటయు సామాన్యము గావున కలప వారు (బాహ్మణులు), మ్రింగువారు (బ్రాహ్మణులు), మంచినీళ్లవారు ( పన్నులు) నుత్పత్తియైనట్లు నిర్ధారణచేసిరి. ఒకడు వండుకొన్న పదార్థము కిరియొకడు గొనిపోయి కలుపుకొని తినజూచుచుండ నింకొకడువ యాంగిపోవుట లోక ప్రసిద్ధమేకాని, నాల్గవవాడు మంచినీళ్లు త్రా రోధపడకున్నది! రత్నముగారి యుపన్యాసమును విన్నవారందరు వారి నత్యంతము గొనియాడిరి.

---

## పూసలబ్బి.

ఒక పూసలబ్బి కేక వేయుచు వీధిని బోవుచుండగా చిన్న పిల్ల యొక వానిని బిలిచి — అబ్బీ అణాకెన్ని పూసలు? — అని యడిగెను, అణ ముప్పదిపూసలని వాడు బదులుచెప్ప - ఆఁ! అణాకు అరవై పూస ఆనాడు అమ్మకొనలేదా? — యని చిన్నది పలికెను. అట్లే తీసికొమ్మని యబ్బి సమ్మతింప, ఒక్కొక్కటే లెక్క పెట్టి యిమ్మని చిన్నది కోరె

పూసలబ్బి — అట్లాగేనమ్మా, [illegible] లాభం, రెండు, మూ అయితే, అమ్మా! నీ కెన్నేళ్లు?

చిన్నది — నాకా? నా కెనిమిదేళ్లు.

పూ॥ యెనిమిదేటమ్మా! యెనిమిది, తొమ్మిది, పది, పదకొండు — అయితే మీ అమ్మకెన్నేళ్లమ్మా?

చి॥ మా అమ్మకా? ముప్ఫయిరెండు.

పూ॥ ముప్ఫయిరెండు, ముప్ఫయిమూడు, ముప్ఫయినాలుగు — మీ నాన్నకో?

చి॥ నాన్నకు నలభై.

పూ॥ నలభై, నలభయ్యొకటి, నలభైరెండు — మీ అమ్మమ్మకు?

చి॥ అమ్మమ్మకాదు, బామ్మ.

పూ॥ అదే, బామ్మకే.

చి॥ యాభయ్యారు.

పూ॥ యాభయ్యారు, యాభయ్యేడు, యాభయ్యెనిమిది, యాభయి తొమ్మిది, అ-ర-వై. అరవై పూసలు - ఒక్క-అణా.

చిన్నది అణా చేతబెట్టగా దీసికొని — అమ్మాయీ! పూసలు జాగ్రత! క్రిందపారబోశేవు - అని బుద్ధిచెప్పి ఆయబ్బి మరియొక వీధికిపోయెను.

---

## కాలస్థితి.

సీ॥ ఏ యింటఁజూచిన నింగ్లీషు చదువులు
కులవృత్తులకు హాని కలుగకున్నె?
ఏచోటఁగాంచిన నచ్చుకూటమ్ములు
కల్లగ్రంథములు వర్థిల్లకున్నె?
ఏదెసఁబోయిన నెన్నొ బ్రాందీషాపు
లయ్యవార్లకు రుచి యమరకున్నె?
ఏయూరికేగిన మాయమృత్యువుఘంట్లు
ముసలివారికి ముప్పుమూఁడకున్నె?

తే-గీ॥ బిచ్చగాండ్రకుఁ జదువులపిచ్చిపట్టె
వంటవాండ్రను బ్రతిమాలవలసివచ్చె
పనులనంటక గడనపై మనసుహెచ్చె
చాకలియు మంగలియు నింకఁజావకున్నె?

---

## టపాసులు.



కొన్ని దినముల క్రిందట బెల్‌ఫాస్టు పోలీసు కోర్టులో నొకరిజేబునుండి మూడు సవరనులపై చిల్లర సొమ్ముగల డబ్బుసంచి దొంగిలించుకొని పోబడెనట. ఈ దొంగతనము జరిగిన సమయమున ఇద్దరు మేజిస్ట్రేట్లు, 25 మంది కనిస్టేబిల్సు, 6 గురు గొప్పలాయర్లు నచ్చట నుండిరట. ఎవరిపై అనుమానపడుటకును ఆస్పదము లేకున్నది!

* *

పల్లెటూరి పుల్లయ్యపంతులుగారు పిల్లదానికి సంబంధము వెదకుచు కాశీభట్ల గంగాధరమూర్తిగారి కుమారుడు కాలేజిలో చదువుకొనుచున్నాడనియు బుద్ధిమంతుడనియు అన్నవస్త్రములకు గొఱతలేని వాడనియు విని, విద్యయున్న నుద్యోగముచేసి గొప్పవాడు కాగలడని తలంచి తల్లిదండ్రులకు తెలుపకయే అతనిని బిలుచుకొనిపోయి పిల్లనిచ్చి పెండ్లి చేసెను. పిమ్మట నతనియింటికి పెండ్లికూతురును గృహప్రవేశమునకు దీసికొనిపోయినపుడు ఎచ్చట జూచిన మాధవకబళపు(అన్న) వస్త్రముతో వ్రేలగట్టబడి యుంటయు తండ్రిగారు నీళ్లకావడిమోయుచు గంగాధర నామము సార్థకము గావించుటయు గని పుల్లయ్యగారు పెల్లుసంతసిల్లిరి.

* *

రామయ్య — నరసయ్య కప్పిమ్మని యెందు కింత సిఫారసుచేస్తున్నావు? నీకేమైనా బాకీవున్నాడా యేమిటి?

కోటయ్య — నాకేమీ బాకీలేదు గాని నీవియ్యకపోతే నన్నుపట్టుకొని పీక్కుతింటాడు. * * *

అప్పులవాడు—మీ వూరికి వెళ్లివచ్చిన తర్వాత బాకీ ఫయిసలు చేస్తానని చెప్పితివే యెందుకు యింకా సొమ్ము పంపించినావు కావు?

బాకీదారుడు— నేను వూరికివెళ్లి వచ్చేవరకూ బాకీ అడుగనని వప్పుకున్నావా లేదా!

అప్పులవాడు—[సంశయించుచు]—వప్పుకున్నాను.

చాకీదారుడు — మరేమి? నేను యింకా వూరికి వెళ్లనేలేదు.

* . *

బిచ్చగాడు——అమ్మా! తల్లీ! ఆదివారపు బిచ్చంతల్లీ! కండ్లులేని కబో
దిని మాయమ్మా!

ఇంటి యజమానుడు —— ఫో ఫో ఫో! ఆడవాళ్లెవరూ లేరు, పోపో!

బిచ్చ॥ ఆడవాళ్లెందుకు నాయనా! బిచ్చంపెట్టాతండ్రీ!

---

## శాస్త్రులవారి రైలుసంచి.

వేదాధ్యయనము చేసిన వేంకట విశ్వనాథ శాస్త్రులవారు విశాఖపట్ట
ణమున రైలెక్కి చెన్నపట్టణమునకు బోవుచుండగా వారిప్రక్కను గూ
ర్చుండిన కోదండరామనాయుడుగారు మధ్యమార్గమున బాపట్లలో దిగి
రైలుసంచి చేతబట్టుకొని పోవుచుండెను. అట్లు కొన్ని యడుగులు పోవు
వరకు శాస్త్రులవారు బిగ్గరగా బిలుచుచు కేకలువేయగా అతడు త్రుళ్లి
పడి నిలువంబడెను. శాస్త్రులవారు పొడుముకాయ రొండిని దోపుకొని
వడివడిగ బండిదిగిపోయి ——

ఒహో! యిదిబహుభాహోవృద్ధి! దానచ్చి పట్టుకుపోతూ వుద్దారు.
బచ్చివడే! తెడ్డి- దానచ్చి తెడ్డి.

నా॥ ఇది మీసంచికాదు నాసంచేనండీ — [సంచిని పరీక్షించిచూచి]
— యిదిగో తాళముకూడా చూడండి.

శా॥ ఒహో! బచ్చిబాట చెప్పారు! అది బీతాళశా! హె-హె-
హే! దిద్ద బాకుబారుడు బజారులో కొది తెచ్చిద్దికాదూ? హె-హె-
హే! చాలుతెడ్డి- తెడ్డి దానచ్చి- వెఱ్రివాడ్డమకుడ్డారా యేబిటి?

నా॥ నాన్సెన్స్! వాటే మ్యాడ్ క్యాప్! — [సంచి తిరుగా పరీ
క్షించి చూచుకొని] — యిది మీసంచికాదండి.

శా॥ దాచ్చెచ్చు దాకు తెలుసుడఁడ్డోయి! బాట బిగలబోకడ్డి!
ఈగల్లంతుగని వారిచుట్టు జనులు గుంపుగూడిరి. అప్పుడు శాస్త్రులు
గారు గూర్చుండిన బండిలోనుండి యొకడు — ఇదుగోనండీ శాస్త్రులు
గారు! మీసంచి యిక్కడనున్నది యిదుగో — నని యొక రైలుసంచి
నేతితో నెత్తి చూపించెను.

శా॥ అది దాసచ్చికాదు. ఇదెదాది. వెయ్యిసచ్చుల్లో పెట్టిదా దాసచ్చి దాకు ఆదుబాలు తెలుస్తుద్ది.

నా॥ అది నాసంచివలెనే వున్నదిగాని నాది కాదు. ఇదే నాది. కావలిస్తే తెరిచి చూపిస్తాను.

శా॥ ఒహాోహో! దాసచ్చి తెరుస్తారుగా! యిదేబి గ్యాయబడ్డి - దాసచ్చి బీరెల్లా తెసుస్తారు? దేవప్పుకోదు.

స్టేషనుమాస్టరు — ఉండడి శాస్త్రులవారూ! యీతగాదా యెందు కండీ - తెరిచి చూపించనియ్యండి.

నాయుడుగారు ఇంతలో తాళము తెరువగా ఆసంచిలో పైపైననే ఒక చుట్టలకట్ట, ఒకనిప్పుపెట్టె, రెండు కల్లురొట్టెలు, సగము ఖర్చుపడిన ఒక బ్రాందిబుడ్డియు కనుపించి ప్రక్కలయందు ఒక శాలువయు పట్టు బట్టయు గ్రుక్కబడియుండెను. శాస్త్రులవారినోట మాటే రాకపోయెను. నాయుడుగారు చప్పున తెలివితెచ్చుకొని సంచి నూసి శాస్త్రులవారికిచ్చివేసి వారిక్షమాపణ వేడికొని బండినుండి తన సంచి తెచ్చుకొని వెడలిపోయెను

ఆమరునాడు ముచ్చివానిని బిలిపించి శాస్త్రులవారు తమ శైలుసంచి మీాద పెద్ద అక్షరములతో పేరువ్రాయించుకొనిరట!

---

## సప్తమహాపురుషులు.

గడచిన ఆదివారమునాటి సాయంత్రమున ఆర్యపురముక్లబ్బులో పెద్ద పెద్దలుచేరి కొంతతడవు ఉన్నిబంతు లెడపెడగొట్టుచు వేసుకగా నాడు కొనియు ఒక్కింతసేపు దంతపు గోలీలను కొయ్యగడలతో గురిచూచి కొట్టికొట్టి లెక్కలు పెట్టియు కడుబడలి చాపునకు కుర్చీలపైవ్రాలి ఫల రసాహారమ్ములుగ్రోలి ఆయాసము దీర్చుకొనుచుండగా ప్రసాదరావు పంతులుగారి ప్రథమపుత్రుడు ఎఫ్. ఏ. పరీక్షలో మొదటి తరగతిలో గృతార్థుడైనట్టు తంతివర్తమానమువచ్చి యచ్చట గూడియుండినవారి సంభాషణము చదువులమీాదను ఉద్యోగములమీాదను తిరిగెను. మన వాడు ఇంగ్లీషు చదివి పరీక్షలుప్యాసై యెంతడబ్బు సంపాదించగలడు ఏ యుద్యోగముచేయును ఎట్టి గొప్పదశకు రాగలడు అను చింతతప్ప

జ్ఞానాభివృద్ధికొరకు విద్యయను సుద్ది యీ కాలమున నెవ్వరును పరికించుటలేదుగదా! ధనముగలవారికే ధనగౌరవములయందాసకలిగియుండు నపుడు పేదలకుండుట యేమి యాశ్చర్యము? కోటివిద్దెలు గూటికొరకన్న ప్రాతసామితె యిప్పు డింగ్లీషువిద్యకు మాత్రమే చెల్లుచున్నది. తక్కినవి లెక్కకేని గానరాక యీకాలమున నింగ్లీషు విద్యమాత్రము చెలామణిగ నున్నది. వచ్చినను రాకున్నను తెలివియున్నను లేకున్నను రెండు ఇంగ్లీషుముక్కలు నేర్చుకొన్న నేదైన నౌకరిచేసికొని సుఖముగా జీవించవచ్చునను ఆశ మీరినది. తుట్టతుదకు మెట్రిక్యులేషను ఫేలయినను ఏతాలూకా కచేరిలోనో యే మునసబు కోర్టులోనో యే సబురిజిస్ట్రారు ఆఫీసులోనో ఆక్టింగు గుమాస్తాపనియైన చేసికొని పొట్టపోసికొనవచ్చునను తలంపు అందరికిని కలిగినది. అటుపై నధికారి అనుగ్రహము సంపాదించుకొనగలిగిన తక్కువేమిటి? ఇట్లు మెట్రిక్యులేషను తప్పినవారికే యుండునప్పుడు ఎఫ్. ఏ. పరీక్ష మొదటితరగతిలో ప్యాసైన చిన్నవానినిగూర్చి చెప్పనేల? ఆహా! ఏమి ప్రసాదరావుగారి భాగ్యమని అందరును ఆయన కుమారునిగూర్చి మాటాడదొడగిరి. అతడు కాలేజిలోచేరి బి. ఏ. పరీక్షకు చదువ నిశ్చయించినమాట అదివరకే తెలియుటచే ఆపైని నేమిచేయుటయని యచ్చటనున్నవారిలో నొక్కరు ప్రశ్న వేసిరి. అదియైనపిమ్మట గదా యని తండ్రిగారనిరిగాని అయినట్లే భావించుకొనవచ్చు గదా అటుపై నేమి చేయించ దలంచి యున్నారని మరల ప్రశ్న వేసిరి. ఒకరా చిన్నవానిని సీమకుబంపి కలక్టరుపరీక్షకేని బారిష్టరు పరీక్షకేని చదివించుట ప్రశస్తమనియు మరియొకరు జపానుదేశమునకుబంపి చేతిపనులును యంత్రపుపనులును నేర్పించుట మేలనియు ఇంకొకరు ఏపనియైన సరేగాని సర్కారు ఉద్యోగము మాత్రము తలపెట్టదగదనియు వేరొకరు వ్యవసాయపరీక్షకు చదివించుట యుచితమనియు డాక్టరుపరీక్షకు చదివించుట సర్వోత్తమమనియు ఇట్లు పలువురు పలుతెరగుల ప్రశంసించిరి. ఈమాటలు విన్న తండ్రిగారి మనస్సు కొంతవరకు గలవరపడియెను.

విశేష విద్యాప్రవేశము లేక ఉద్యోగమునందు చేరనివాడయ్యును పెద్దలు పెట్టిపోయిన భూస్థితిని వృద్ధిపరచుకొనుచు ల్యాండులార్డు అను

పేరుతో పదిమందిలో పరువుగ తిరుగుచున్నవాడు గావున ప్రసాదరావు పంతులు తన తనయునిమాట యిందరు పెద్దలు మాటాడుకొనుచున్నప్పుడు తాను మారుపలుకకుండుట తగదని తలచి తనకంతగా నధికమగు నాస్తులేమియు లేవనియు దైవానుగ్రహమువలన చిన్ననాడు బి. ఏ. పరీక్షయందుగూడ నెగ్గెనేని బి. ఎల్. చదివి హైకోర్టువకీలు కావలెననియే తమ యెన్నికయనియు డబ్బువచ్చినను రాకున్నను ఇంటిపట్టుననుండుటయే తమకోరికయనియు వెలిబుచ్చెను. కాని, తనకుమారుడు హైకోర్టువకీలైనచో అన్నికేసులు నతనికే యొరుగుననియు లక్షలక్షలుగ గడియించుననియు మనసులో ఆయనకు నమ్మకముండకపోలేదు. అప్పుడచ్చటనుండిన నానాగోత్రేభ్యులు నీతీరున ప్రసంగించిరి.

వకీలు వాసుదేవమూర్తిగారు:— వకీలుపని చేస్తే రెండుచేతులతో పోగుచేయవచ్చునని అందరూ భ్రమపడడమేగాని ఆకాలంపోయి చాలాదినాలైనది. ఇప్పుడు యేవీధిలోచూచినా వకీళ్లే. ఇరవై సంవత్సరాల కిందట నేను పట్టాపుచ్చుకొన్నప్పుడు యీవూళ్లో వక్కడే బి. ఏ., బి. యల్., వుండేవాడు. ఇప్పుడు లెక్కపెట్టిచూడండి ముప్ఫయితొమ్మిదిమంది వున్నారు! వీరిలో యిద్దరు ముగ్గురుతప్ప తక్కినవారేమి బావుకుంటున్నారు? అయ్యవారు చచ్చినప్పుడుగాని అప్పు బయలుపడదన్నట్టు పైడాబులేగాని ఖర్చుకు చాలినడబ్బు సంపాదించుకొనేవాడు గట్టివాడని చెప్పవచ్చును. ఇది యిల్లావుండగా యీ వకీలుపనంత పాడుపని నిశ్చయంగా యింకొకట లేనేలేదు. కేసులువచ్చినా కష్టమే, రాకున్నా కష్టమే. ఉదయం సాయంత్రం రాత్రి తెల్లవారుఝామున యింట్లోను కోర్టులోను యెప్పుడూ కేసులపాఠమేగదా! ఇదేమి రామాయణమా భారతమా - దేశంలో అందరియొక్క చరిత్రలూ పాఠముచేస్తూ వుండడం? ఏదైనా మనస్సుకింపైన గ్రంథము నెమ్మదిగా చదువుకోడానికి టైముంటుదా? గ్రంధముదాకా యెందుకు? పెండ్లాముతో తిన్నగా మాట్లాడడానికి వకటి తీరిక యేడుస్తుందీ? ఏదో అవసరంగా రెండుముద్దలు మింగడం - కోర్టు, కేసులు, కోర్టు, కేసులు - స్వర్గం మోక్షం అంతా అదే. ఇది అదృష్టవంతునిమాట సుమండీ, తక్కినవాళ్లకు అదిలేదు. వకీళ్లకంటె గుమాస్తాలపని పదిరెట్లు మెరుగు

గానున్నది. అది పోనియ్యండి - వకీలువృత్తియేమో యిండిపెండెంట్ ప్రొఫెషన్ అనిగదా చెప్పుకుంటారు? నిజంగాచూస్తే వకీలుకు యిండిపెండెన్సే లేదు. పార్టీలనందరినీ ప్లీజుచేస్తూవుండవలెను సరేగదా అధికార్లకు అనుసరణగావుంటేనే యేమైనా రెండుడబ్బులు దొరకడం - లేకుంటే. సెడిషన్ మాంగర్లలోను వందేమాతరంగాళ్లలోను చేర్చబడి అధికార్లవల్ల స్కౌండ్రెల్ గా భావింపబడడంతప్ప వేరే లాభంలేదు. కలక్టరుగారివద్ద చిత్తం చిత్తం అంటూ కాలువంచకపోతే గవర్నమెంటు ప్లీడరీ యెల్లాదొరుకుతుంది? దొరికినా యెల్లా నిలుస్తుంది? ఈకాలంలో అలాగంటివాళ్లే ముందుకువస్తూవున్నారు. వాళ్లకేడబ్బు, వాళ్లకే పరువు, వాళ్లకే హోదాలు బిరుదులు, అన్నీ వాళ్లకే. ఛీ-ఛీ-ఛీ! యీ వకీలుపనంత వెధవపని యేదీలేదు. పురుషోత్తం పంతులుగారు ప్రవేశించినప్పుడే నేనుకూడా మునసఫీలో ప్రవేశించినట్టయితే యీపాటికి సుఖంగా ఫస్టుక్లాసులో వుండేవాణ్ణి - హాయిగా నెలకు నాలుగువందలు వస్తూవుండును. ప్రసాదరావుగారూ! యీ మాట జ్ఞాపకవుంచుకోనండి - మీవాణ్ణి బీ.ఎల్. చదివిస్తే చదివించండిగాని వకీలుపనిలోమాత్రం వుండనియ్యవద్దు. నాలుగైదేళ్లలో యెల్లాగైనా మునసఫీలో ప్రవేశపెట్టిస్తిరా క్రమంగా వృద్ధిలోనికివస్తాడు. తప్పకుండా జిల్లాజడ్జీకూడా అవుతాడు. సందేహంలేదు దిసిజ్ మై సిన్సియర్ అడ్వయిస్.

మునసఫు పురుషోత్తం పంతులు:— వాసుదేవమూర్తిగారు సెలవిచ్చిందంతా వాస్తవమేగాని వక్కటిమాత్రము పొరబాటు. వకీలువృత్తిమీద అసహ్యమువేశే నేను మునసఫీలో ప్రవేశిస్తిని. కానియేలరా సుఖానవున్న ప్రాణం కష్టాన పెట్టుకుంటిని అని యెన్నోసార్లు విచారపడ్డాను. మునసఫు పనికంటె కూలికి గుమాస్తాపని చేసుకోవడము మేలు. మాకు యిచ్చేజీతం మేముచేసే దస్కతులకూ వ్రాసే సాక్షివాఙ్మూలాలకూ యియ్యవచ్చును. వ్రాసివ్రాసి చెయ్యి అరిగిపోతుంది. చిట్టచివరకు పక్షవాతమో అతిమూత్రమో ప్రాప్తించడం నిశ్చయం. పైగా మూడేళ్లకొకసారి కాశీనుండి రామేశ్వరానికి రామేశ్వరంనుండి శ్రీశైలానికి తన్నుతూ వుంటారు. మడతమంచాలూ మడతకుర్చీలూ మూటలూ మేమూ, ఒకచోట నిలకడా, యిల్లా, వాకిలా - పిల్లలకు

చదువూ సంధ్యా అన్నీ పూజ్యంగద! ఎన్నటికో చచ్చేనాటికి సబ్జడ్జీపని అయితే యెంత, కాకుంటే యెంత? అదికూడా యెవరికో అదృష్టవంతులకూ వంగి సలాములు చేసేవారికేగాని అందరికీ కాదుగద! అసలు బి. ఏ. బి. ఎల్. ప్యాసై మునసఫీ చేసేవాళ్లు అంతవరకూ జీవించేది యెక్కడిది? చదువుతోనే సగము ఆయుస్సు చెల్లిపోతుంది - తక్కిన సగము ఫస్టుక్లాసుకు రాకమునుపే చెల్లిపోతుంది. యీమాట అబద్ధము కాదు - సివిల్ లిష్టుతీసి చిత్తగించండి. ఇక మేము చేసేపని మాట్లో— ఛీ-ఛీ-ఛీ — చురుకుగా పనిచేస్తే వకీళ్లు తిట్టుతారు, చెయ్యకపోతే పైవాళ్లు గూటెస్తారు. ఎందుకూ పనికిరానివాడు యీ పనిలో ప్రవేశించవలెనుగాని కొంచెము తెలివితేటలుగలవాడెవడూ ప్రవేశించగూడదు. దీనికంటె రివిన్యూడిపార్టుమెంటు నూరురెట్లుసుఖం - బ్రెయిన్ వర్కు-తక్కువ—నాతో ప్యాసైన పానకాలరావు యిప్పుడు డిప్యూటీ కలక్టరుగానుండి హాయిగా ఆరువందలు తెచ్చుకుంటూవున్నాడు. బి. ఏ. ప్యాసైన తర్వాతనైనాసరే బీ. ఎల్. ప్యాసైన తర్వాతనైనాసరే రివిన్యూలైనులో ప్రవేశించడము సర్వోత్తమమని నా అభిప్రాయము.

డిప్యూటీ కలెక్టరుగారు:—మునసఫుగారికి డిప్యూటీ కలెక్టరుపని సుఖముగా కనుపడ్డది కాబోలును. అవును సుఖంకాదా! చిన్న ఉద్యోగమేదీ చెయ్యకుండా వక్కసారిగా **200** రూ॥ పనిలో ప్రవేశించడమూ, **11** గంటలకు కోర్టుకువెళ్లి సాయంత్రము **6** గంటలకు యింటికి చేరడమూ, సంవత్సరానికి రెండు నెలలు సెలవులూ, సర్క్యూటు పనిలేకపోవడమూ—యిదంతా నిజంగా కష్టమే. పదిహేను రూపాయలపనిలో ప్రవేశించి పైవాళ్లచేత చిట్టిమొట్టికాయలుతింటూ పదియేళ్లకయినా యాభయిరూపాయల పనికి ప్రమోషను లేకుండా అనుభవించినవారికిగదా రివిన్యూడిపార్టుమెంటుసుఖము తెలుస్తుంది? నెలకుయిరవైరోజులు పెండ్లాము బిడ్డలను వదిలి వూరూరూ తిరుగుతూ వూరూరి నీళ్లూతాగుతూ వుండడంకంటె సుఖమేమిటి? చెప్పుకుంటే సిగ్గులచేటు ఎన్నాళ్లు బానిసతనంచేసి యెందరు డలాయతులను మంచిమాట చేసుకుంటే **100** రూ॥ల జీతం దొరుకుతుంది? ఛీ-ఛీ-ఛీ! రివిన్యూయిలాకా పనికంటె చాకలిపనిమేలు. ఇంకా యింజనీరు డిపార్టుమెంటుమాట

చదువూ సంధ్యా అన్నీ పూజ్యంగద! ఎన్నటికో చచ్చేనాటికి సబ్జడ్జిపని అయితే యెంత, కాకుంటే యెంత? అదికూడా యెవరికో అదృష్టవంతులకూ వంగి సలాములు చేసేవారికేగాని అందరికీ కాదుగద! అసలు బి. ఏ. బి. ఎల్. ప్యాసై మునసఫీ చేసేవాళ్లు అంతవరకూ జీవించేది యెక్కడిది? చదువుతోనే సగము ఆయుస్సు చెల్లిపోతుంది - తక్కిన సగము ఫస్టుక్లాసుకు రాకమునుపే చెల్లిపోతుంది. యీమాట అబద్ధము కాదు - సివిల్ లిష్టుతీసి చిత్తగించండి. ఇక మేము చేసేపని మాట్లో— ఛీ-ఛీ-ఛీ — చురుకుగా పనిచేస్తే వకీళ్లు తిట్టుతారు, చెయ్యకపోతే పైవాళ్లు గూటెస్తారు. ఎందుకూ పనికిరానివాడు యీ పనిలో ప్రవేశించవలెనుగాని కొంచెము తెలివితేటలుగలవాడెవడూ ప్రవేశించగూడదు. దీనికంటె రివిన్యూడిపార్టుమెంటు నూరురెట్లుసుఖం - ప్రెవేటు వగ్యా తక్కువ—నాతో ప్యాసైన పానకాలరావు యిప్పుడు డిప్యూటీ కలెక్టరుగానుండి హాయిగా ఆరువందలు తెచ్చుకుంటూవున్నాడు. బి. ఏ. ప్యాసైన తర్వాతనైనాసరే బీ. ఎల్. ప్యాసైన తర్వాతనైనాసరే రివిన్యూలైనులో ప్రవేశించడము సర్వోత్తమమని నా అభిప్రాయము.

డిప్యూటీ కలెక్టరుగారు:—మునసఫుగారికి డిప్యూటీ కలెక్టరుపని సుఖముగా కనుపడ్డది కాబోలును. అవును సుఖంకాదా! చిన్న ఉద్యోగమేదీ చెయ్యకుండా వక్కసారిగా 200 రూ॥ పనిలో ప్రవేశించడమూ, 11 గంటలకు కోర్టుకువెళ్లి సాయంత్రము 6 గంటలకు యింటికి చేరడమూ, సంవత్సరానికి రెండు నెలలు సెలవులూ, సర్క్యూటు పనిలేకపోవడమూ—యిదంతా నిజంగా కష్టమే. పదిహేను రూపాయలపనిలో ప్రవేశించి పైవాళ్లచేత చిట్టిమొట్టికాయలుతింటూ పదియేళ్లకయినా యీభయిరూపాయల పనికి ప్రొమోషనులేకుండా అనుభవించినవారికిగదా రివిన్యూడిపార్టుమెంటుసుఖము తెలుస్తుంది? నెలకుయిరవైరోజులు పెండ్లాము బిడ్డలను వదిలి వూరూరూ తిరుగుతూ వూరూరి పల్లోతాగుతూ వుండడంకంటె సుఖమేమిటి? చెప్పకుంటే సిగ్గులచేటు ఎన్నాళ్లు బానిసతనంచేసి యెందరు డలాయతులను మంచిమాట చేసుకుంటే 100 రూ॥ల జీతం దొరుకుతుంది? ఛీ-ఛీ-ఛీ! రివిన్యూయిలాకాపనికన్నా చాకలిపనిమేలు. ఇంకా యింజనీరు డిపార్టుమెంటుమాట

చచ్చిపోవలెను. స్కూలుమాస్టరంటే ఆడవాళ్లుకూడా గౌరవంగా చూడరు! సయన్సులో బి. యే. ప్యాసైనవాణ్ణి యెమ్మే వెలగబెట్టకుండా మెడికల్ కాలెజ్‌లో చేరినట్టైయితే హాయిగా యేవూళ్లోనైనా యింత స్వతంత్రంగా జీవనంచేస్తూ వుండేవాణ్ణే - యిప్పుడు విచారపడి యేమి ప్రయోజనము? అన్నిటిలోకీ యీ కాలంలో మెడికల్ ప్రొఫెషనే కొంచెము లాభకరంగానూ పదిమంది గౌరవించేదిగానూ వున్నది.

డాక్టరుగారు:—నిజమే, పదిమందికాదు వెయ్యిమందికూడా గౌరవిస్తారు. అవసరం వున్నంతమట్టుకు అందరూ డాక్టరుగారిచుట్టూ తిరిగేవారే. డబ్బుఅడగవచ్చేటప్పటికిమాత్రం డాక్టరుగారు ఆశపాతకుడుగా కనుపడతాడు. ఎవరు యేమిస్తే అదిపుచ్చుకొని దొంగనవ్వులు నవ్వుతూ ఆడవాళ్లను అమ్మాతల్లీఅని లాలిస్తూవుంటే డాక్టర్లకే యిదికాలంగాని కరక్టుగా డబ్బు అడిగేడాక్టర్లకు కాలంగాదు. ప్రొద్దున మొదలు సాయంత్రంవరకూ హాస్పిటల్‌లోనూ కాలేజిలోనూ చచ్చినున్నమైకడ తేరడమూ, తర్వాత యెక్కడికి యే రాత్రివేళ పిలిచినా పరిగెత్తడమూ తప్ప డాక్టరుగారి సంపాదన చూడబోతే అంతటిలోనే వుంటుంది. పోనీ యింతకష్టపడినా యేమైనా ప్రయోజనం వున్నదా? అంతా మిగిలిపోయినతర్వాత అక్షింతలు గింజలు నాలుగూ తలమీదచల్లడానికి డాక్టరుగారిని పిలుస్తారుగాని మొదటనే యెవరుపిలుస్తారు? యే వీధిలోచూచినా డాక్టర్లే. అర్ధరూపాయి యిస్తే ఆరుపూటలు తిరిగిపోతారు, మందుకూడా వారే తెచ్చిస్తారు - యింగ్లీషు డాక్టర్లెవరికి కావలెను? పైగా యిప్పుడు ప్రతివాళ్ల యింట్లోనూ మందులే. వైద్యం ముక్కూముఖం యెరగనివాళ్లుకూడా యే బొంబాయిలోనో కాశీలోనో కలకత్తాలోనో కూర్చుండి పెద్ద కంపెనీల పేరుపెట్టుకొని దడబిడలుగా మందుల క్యాటలాగులు పంపిస్తే వాటిని నమ్మి యెందుకూ పనికిరానిమందులు తెప్పించుకొని సొమ్ము కుమ్మరిస్తారుగాని డాక్టర్లకుసొమ్మెవరిస్తారు? డాక్టరుపనికంటె మందు లమ్ముకునేవాళ్ల పని బాగావున్నది. యీ కాలంలో యే చదువు వల్లనూ ప్రయోజనం కనపడలేదు. యేదైనా వర్తకం పెట్టుకుంటే హాయిగా జీవించవచ్చును. సొమ్మూ సంపాదించవచ్చును.

జెనరల్ మర్చెంటుగారు:—చిట్టచివరకు మేమూ కనపడ్డాము? మా లాభనష్టాలు మాకే తెలియపలెనుగాని చెప్పితే యెవరు నమ్ముతారు? ఎన్ని లెక్కలు చూపించినా మా సంపాదనకు నాలుగురెట్లుమీద యిన్ కంటాక్సు కట్టితే నోరుమూసుకొని వూరుకోవలసిందేగదా! యిక రాత్రింబగళ్లు తిన్నగా నిద్రపోతామో పోమో మాక్షోభ యెవరికి తెలుసును? వర్తకమంటే పెండ్లాంపేరనో అత్తపేరనో సొమ్ము దాచుకుని దివాళాతీసేవాళ్లకు లాభంగాని తక్కినవాళ్లకు హాస్యగాడు చెప్పినట్టు చెయ్యి తగలడమేగాని మరేమీ లేదు. యీశ్వరా! యీ వర్తకాలు శత్రువులకుకూడావద్దు. దీనికంటె చిల్లరదుకాణమో మిఠాయి దుకాణమో పెట్టుకుంటేమేలు. లేకుంటే పెండ్లాముమెడలో పుస్తె



అయినా తెగనమ్మి నాలుగు యకరాలు సంపాదించుకొని వ్యవసాయం చేసుకుంటూ యేదైనా పల్లెటూళ్లోవుంటే దాన్ని మించింది యేదీలేదు. అదుగో డిప్టీ కలెక్టరుగారు లేస్తూవున్నారు. చాలులెండి నేటి కీ ప్రసంగములు.

---

## దురభ్యాసములు.

**1.** ఎవరితోనైన మాటలాడునప్పుడు అతనిని చేయిపట్టిలాగుట, భుజముమీద చరచి వినుమని వేధించుట, మాటమాటకు చేతులతో నభినయము చూపుట.

**2.** ఎవరింటికైన బోయినప్పుడు అతని పుస్తకములు వస్తువులు ముస్నగు వానిదీస యిటునటు వేయుట, కుర్చీపై గూర్చుండి వెనుకకాళ్లను టక్కటక్కనగొట్టుట, కాలాడించుట, బల్లమీదికి కాళ్లుసాచుట, వ్రేళ్లతో బల్లమీద తాళము వేయుట, యీలవేయుట, అతనియుత్తరములు తీసి చూచుట, అతడుత్తరము వ్రాయుచుండ తొంగిచూచుట.

**3.** నలుగురిలోగూర్చుండి, ఉన్నచోటనె చీదుట, ఉమ్మివేయుట, నోటిలో వ్రేళ్లుపెట్టుకొనుట, ఆవులించుట, బట్టపైకెగదీసికొనుట, నిముషమునకొకసారి మీసము దువ్వుకొనుట.

**4.** పిల్లలనుముద్దుకై విసికించి యేడ్పించుట, స్త్రీలవంక తేరిపార జూచుట, సుందరవతి యెదురైనప్పు డెదోవంక పెట్టుకొని తిరిగిచూచుట, పాటకచేరిలో ప్రక్కవారితో గుసగుసలాడుట.

**5.** భోజనమునకు బిలిచినదే చాలునని యింటివార నందరిని దోడ్కొనిపోవుట, (ప్రగల్భరామునివలె) పిలువనిదే పెండ్లిభోజనమునకు బోవుట, బుఱ్ఱున జుఱ్ఱుచు భోజనము సేయుట.

**6.** అందరితో తనప్రతాపమును గూర్చియు తానుచేసిన చేయబూనిన ఘనకార్యములగూర్చియు ప్రసంగించుట, తనను తనభార్యను బిడ్డలను పొగడుకొనుట, పరులను దూషించుట, యెల్లరకు వంకలు వెదకుట.

## బిడ్డల ప్రశ్నలు.

**1.** ఆరేండ్లవయసుగల యొకబిడ్డ, కాగితములు కోసియుండని మాసపత్రికలో రెండుపుటలనడుమ తొంగిచూచి — "అమ్మా! యీ లోపల యెల్లా అచ్చేచారే?" — అని ప్రశ్న వేసెను.

**2.** పొరుగింటిపిల్లమీద పినతల్లి (పిన్ని) చాలఅపేక్ష గలిగియుంటగని, అయిదేండ్లచిఱుత యొక్కర్తు — "అమ్మా! నీకు నేను చెల్లెలైపుటితే నాకు పిన్ని నౌతానూ? చెప్పూ" — అని యడిగెను.

**3.** నాలుగేండ్లబిడ్డ — "అమ్మా, చక్కెలతింతే యేదైనా లోగం కుదాలుతుందా?"

## చీనాచక్రవర్తి కథ.

భగవత్సూనుండా సార్వభౌమునినామ మాచంద్రార్కము వెలుంగుచుండుగాపుత! లై-ఓ-ఆ చక్రవర్తి తనపింగాణిభవనమునందొక గవాక్షము చెంత నిలిచియుండెను. వయసుచెల్లని వాడగుట నాతని హృదయము సదా దయాపూరితంబై యుండెను. తానెట్టి యపార భోగభాగ్యంబుల నోలలాడుచున్నను ఆమహాపురుషుం డనవరతము పేదల కష్టములనుగూర్చి తలపోయుచు వ్యసనము చెందుచుండును.

ఉన్నట్లె మిన్ను మన్నొక్కటి యగునట్లు ఉరుములు మెరుములతో నఖండమగు వర్షము గురియ నారంభించెను. ఆకసము విలపించెను.

వృక్షములును పుష్పములును గన్నీటి ధారలు గార్చెను. ఆభూపాలుని హృదయము ఖేదముతో నిండ నాతండు — "అక్కటకటా! యిట్టివర్షములో నెత్తికి గుళ్లాయేనిలేనివారి కష్ట మెట్టిదనియెన్నవచ్చు!" — నని వగచుచు నిట్టూర్పు విడిచెను.

అంతట చెంతనున్న చిన్నమంతిరిని బిలిచియాచక్రవర్తి — "మంతిరీ! మనపిక్కినుపురిలో నెత్తినిధరియింప గుళ్లాయేనిలేక యిట్టివర్షములో బోవుచుండు వారెందరుందురు?" — అని యడిగెను.

సుంగ్ - హీ - సంగు సాగిలపడి మ్రొక్కి — "మార్తాండతేజో వైభవా! రాజాధిరాజులకు శక్యంబులుగాని కార్యంబులుం గలవా? ఉదయపతీ! దినకరు డస్తమించులోపలన దేవరకోరినది తెలుపనగు" — నని యుత్తరమిచ్చెను. చక్రవర్తియు కృపాసూచకంబుగ చిరునగవు నవ్వి తలయూచెను.

అంత నొకనిముసమేని నచ్చో నిలువక సుంగ్ - హీ - సంగు అతివేగముగ ప్రధానమంత్రియొద్దికి పరువిడి, యతనికి జూపవలయు మర్యాదలించుకయు బాటించక, యూపిరిలేని మాటలతో — "మంత్రివరా! మనయేలికమనంబు వ్యసనపూరితంబై యున్నయది. ఈపిక్కినుపురిలో నెత్తికిగుళ్లాయేనిలేక యీ వర్షములో బోవుచుండు దౌర్భాగ్యులగూర్చి యాతడు గడు జింతిల్లుచున్నవాడు. అట్టి వారీపట్టణంబున నెందరుందురో సాయంకాలములోపల దెలియగోరుచున్నవాడు —" అన్ని విన్నవించెను.

"ఆ దౌర్భాగ్యులమాట యడిగిరన్న నేమి యాశ్చర్యము? వారు వట్టిదుర్మార్గులు, తోడుదొంగలు?" — సం - చే - సంగాతు పలికెను — "ఇంతెగాక — సరిసరి! —"

నగరాధికారియగు పై-హీ-వోగారినంతట బిలువనంపిరి.

పై - హీ - వోగారువచ్చి సాష్టాంగ ప్రణామంబాచరించి నిలిచిన తరినా ప్రధానమంత్రి— "వింటివా! మనపిక్కిను పట్టణమున నెద్దియో యక్రమము మనచక్రవర్తిగారికంట బడినది. మనప్రాణములు సమర్పింపవలసి వచ్చెడిని —" అని తెలిపెను.

నగరాధికారి గడగడ వడకుచు — "అదియెట్లు పాటిల్లెను? పట్టణము ప్రభుదృష్టికి గోచరముగాకుండ బెద్ద యుద్యానవన మడ్డముండెగదా!" యని యాశ్చర్య పడసాగెను.

"అదియెట్లో యూహింపజాల —" సం - చే - సంగారు పలికిరి — "కాని యీ వానలో నెత్తికిగుళ్లాయేని లేక గోడలపంచలను మూలలను ముచ్చులవలె డాగియున్న దుష్టపిశాచమ్ములను మనప్రభువు గనియుండును. అట్టి దౌర్భాగ్యులు మన పట్టణంబున నెందరుందు రీ సాయంత్రము లోపల దెలియ గోరుచున్నవాడు."

ఆపట్టున పై - హీ - వోగారు పసువిడిపోయి, ఆ మాలకుక్కను జూర్ - సంగును ఈడ్చుకొనిరండని తనక్రిందివారి కుత్తరువుచేసెను.

అంతనాపెద్ద కావలివాడు వెల్లబారిన మోముతోడ వచ్చి కరములు మోడ్చుకొని నగరాధికారి పాదములకడ సాగిలంపడ నాతడు వానిపై తిట్లవాన గురిపించెను! "ఓరిదురాత్మా! దుష్టా! భ్రష్టా! ఛండాలా! పాపిష్ఠీ! మమ్మెల్ల బరలోకమునకు బనుపనెన్నితివటరా? మామెడలను రంపమున గోయించనెంతివా?" — యని మండిపడుచు పలికెను.

జూర్ - సంగు భయవినయమ్ములు వెలువడ — "తండ్రీ! గులాముపై నింతగోపమురా గారణము తెలియకున్నది. తెలిపి నన్నిప్పట్టునను చంపుడు" — అని వేడుకొనియెను.

"ఓరికుక్కా? గొర్రెలగాయుచుండవలయు నీకు ఈపురి కాపొప్పగించిన తప్పు నాదిగదా! ఇప్పురిలోని కొందరు దౌర్భాగ్యులు తప్ప త్రాగి యీవానలో నెత్తినిగుళ్లాయేని లేక తోటలలోను త్రోవలలోను తిరుగుచు తారుచుండిరట - మనచక్రవర్తిగారు కన్నులార గనిరట. అట్టి దౌర్భాగ్యులు మనపురియందెందరుగలరో యీసాయంత్రములోపల నీవె మాకు తెలుపవలయు, లేకున్న ప్రాణములు మనవికావు" — అని తెలియజెప్పెను.

"చిత్తము!" — అని జూర్ - సంగు ముమ్మారు తనశిరస్సు నేలపై దాకించి — "అంతయు నీసాయంత్రములోపల సరిచేసెద" ననిపలికి, వేవేగపరచి, చిందులు ద్రొక్కుచు, అతిభీకరంబుగ భాషించుచు కావలివాండ్రెల్ల గుంపుగూడుటకై గంటమ్రోయించెను.

"దొంగగాడిదెలార! చూచుచు మీలో సగముమందిని తుండెము లుగ ఖండింతును. తక్కినసగము మందినిచీల్చి చిచ్చుపాలు సేయుదును. ఇదియా మీరు గాచుకావలి! యీవానలో నెత్తికి గుళ్లాయేనిలేని దౌర్భాగ్యులు తోటలలోను త్రోవలలోను తాగుచున్నారట. ఒకగంట లోపల నట్టివారినెల్ల పట్టిబంధింపుడు" — అని యాపెద్దకావలికాడు మహోగ్రుండై పలుక భటులెల్ల నలుదిక్కులకు బరచిరి. గంటలోపల చెట్ల క్రిందను వంతెనలక్రిందను ఎచ్చటెచ్చటనున్న బిచ్చగాండ్రనుదౌర్భాగ్యులను వారు జుట్టుపట్టి యీడ్చుకొనివచ్చి జైలుకానాదొడ్డిలోపల నిలువంబెట్టిరి.

వీరందరెంద రుందురని జూర్ - సంగు అడిగెను. కావలివాండ్రు కడు వినయముతో వంగి, **20871** మందియని జవాబుచెప్పిరి.

"ఈ పుండాఖోర్ల పుత్త్రులను ఖండింపుడు"—అని జూర్ - సంగుగారు త్తరువుసేయ నరగంటలోపల నాదరెతలలును మొండెములును వేరయ్యెను.

అంతట జూర్ - సంగు పై - హీ - లోగారికి వర్తమానము తెలుపవారును దానిని సం - చే - సంగారికి తెలియపరచిరి. సం - చే - సంగారు సుం - హీ - సంగుగారికి విశదపరచిరి.

సాయంత్రము సమీపించెను. వానవెలిసి చెట్లకొమ్మలు గాలికల్లన గదలుచు ఆకులనుండి క్రిందిపుష్పలతలపై ముత్యములవలె వర్షబిందువులురాలసాగెను. పూవులనుండి కమ్మనితావులు నలువంకల జిమ్ముకొననారంభించెను. అప్పుడు లై - ఓ - ఆ సార్వభౌముడు తనపింగాణిభవనమున నొకగవాక్షముకడ నిలిచి యుద్యానవనమునందము గొనియాడుచుండెను. కాని, యాతడానిముసమున దనపట్టణమందలి దౌర్భాగ్యుల దుర్గతిమాట మరచినవాడు కాడు.

సుంగ్ - హీ - సంగుగారిని గని చక్రవర్తిగారడిగిరి : "ఇట్టి వానలో ధరించుటకు నెత్తికి గుళ్లాయేనిలేని దౌర్భాగ్యులు మనపురియందెందరుందురో కనుగొని మాకు దెలుపవలసి యుండెగదా?

"ఔను. ప్రభువరుల యానతి నెరవేర్చినవాడ."

"ఎందరుందురు? మరుగుపరచక నిజమే తెలుపవలయు ఋషీ!"

"మహాప్రభూ! ఈపట్టణమందేమూలలను నేవర వక్కాణించిన యట్టి గాఱ్ఱాభగ్యులు లెక్కకొక్కగుగూడ లేరు. ఇది సత్యము - ముమ్మాటికి సత్యము" — అనిపలికి, చక్రవర్తిగారి పాదములను సుంగ్-హీ-సంగు ప్రమాణసూచకముగ తలత్రోదాకెను.

సదయహృదయుండగు లై-ఓ-ఆ సార్వభౌముని మోమున పరమానందము చిగుర్ప నాతఁడు — "ఆహా! ఎట్టిసుఖవంతమైన రాజ్యము! జనులందరు నెంతసౌఖ్యముగ నున్నారు! అంతయు దైవకృప గదా!" — యని సంతోషముతో బలికెను. చక్రవర్తిగారి సంతోషమును గని యారాజ భవనమునందుండు వారెల్లరు సంతోషపూరితులైరి. మరునాడు సం-చే-సంగారును, షై-హీ-వోగారును, జూర్-సంగుగారును బంగారు పతకములను బహుమానములుగ బడసిరి!

## తెల్లపాము - నల్లపాము.

ఒక తెల్లపామును నల్లపామును మైత్రిచేసి తమయపేక్షకొలది తెల్లపాము తోకను నల్లపామును, నల్లపాముతోకను తెల్లపామును, కరువనారంభించెనట. కొంతసేపటికి తెల్లపాము అడిగెనట—ఎంతవరకు మ్రింగితివి! నడుమువరకు మ్రింగితినని నల్లపాము జవాబుచెప్పెనట. నీ వెంతవరకు మ్రింగితివని నల్లపామడుగ నేనుగూడ నడుమువరకే మ్రింగితినని తెల్లపాము జవాబుచెప్పెనట. ఇట్లు తెల్లపామును నల్లపామును ఒండొంటిని తోకమొదలుకొని మ్రింగను మ్రింగను దానినిదియు దీనినదియు సంపూర్ణముగ మ్రింగివేసెనట. తుట్టతుదకేమియు లేకుండ పోయెనట! ఆహా ఎంత విచిత్రము!

## గురుస్వాములవారు.

కోవెలపురములో నొకానొకప్పుడొక గురుస్వాములవారు మఠమేర్పరచి కులస్త్రీలకు వేదాంతోపదేశము చేయుచు వారిలో నెట్టెట్లో సలుగురు ప్రౌఢాంగనలతో నొండొరులకు దెలియకుండ మనసుగలుపుకొని నీవే నాకు ప్రియశిష్యురాలవని యొక్కొకరికి ప్రత్యేకముగ ప్రమాణముచేసి పరమానంద సాగరంబున దేలుచుండిరట. ఒకనాడు వారిలో నెరజాణ

నెల్లూరునుండి.

ఎవరు తీసికొని వచ్చినారు?

నాగ్రహపాటు.

ఈ మాటల కందరు నవ్వుచుందురు. మిథునపురములోనుండు వారెల్ల కిట్టమ్మ ముద్దు మాటలనుగూర్చి పలుమర్లు చెప్పుకొనుచుందురు. ఇట్లుండ నొకనాడెట్లో యా చిలుక పంజరమునుండి తప్పించుకొని పారిపోయెను. కిట్టమ్మకు స్వేచ్ఛావృత్తి లభించెనుగాని పిచ్చన్నకు పిచ్చిపట్టునంతవిచారము కలిగెను. అతని దుకాణమునం దమ్మకమును నానాటికి తగ్గిపోయెను. కిట్టమ్మ యెచ్చటనున్నదో కనుగొనుటకై యతడెన్ని ప్రయత్నములు చేసెనుగాని అన్నియు నిష్ఫలమయ్యెను. కిట్టమ్మనుదెచ్చి యిచ్చినవారికి నూరువరహాలు బహుమతియిత్తుననియు నాతడు ప్రచురపరచెను.

పిచ్చన్నపై నొకింతయు బెంగగొనక కిట్టమ్మ తోడిచిలుకలతో స్వేచ్ఛావృత్తిని సంతోషముగా దిరుగుచుండెనుగాని, కొన్ని మాసములు గడచిన పిమ్మట తన చెలికత్తెలతోగూడ నొక వేటకానివలలో చిక్కుపడియెను. పాపము! అప్పుడు కిట్టమ్మ కెట్టివిచారము కలిగియుండును? పిచ్చన్నయు జ్ఞప్తికివచ్చి యుండవచ్చును గదా!

ఈ వేటకాడు తాబట్టిన పిట్టలను కొన్నిటి పొట్టలుచీల్చి లోపటదూదివెట్టి చిత్రశాలకమ్ముకొనుచుండును. కొన్నిటిని చేరువనుండు హోటల్ వారికి విక్రయింప వారు రుచ్యముగవండి వచ్చినవారికి బెట్టుచుందురు. ఇదంతయు కిట్టమ్మకు తెలియకపోలేదు.

తమకు చావుమూడెనని చిలుకలెల్ల గడగడ వడక దొడగెను. వేటకాడు ఒక్కొకచిలుకను వలనుండి వెలికిదీసి మెడవిరిచి సంచిలోవేసికొనసాగెను. కిట్టమ్మకు తనయంతకాలము సమీపించెనని స్పష్టమయ్యెను. ఎట్లు తప్పించుకొనవచ్చును? ఆ వేటకాడు ప్రశ్నలడుగడు గదా! అడుగకున్న నేమి, మనమే యేలమాటాడగూడదని తలచి యాచిలుక "నేను కిట్టమ్మను!" "నేను కిట్టమ్మను!" అని మరిమరి కూయసాగెను. వేటకాడు నివ్వెఱపోయి యాపిట్టను చేత బట్టుకొనిదువ్వి "నీవెవరవు?" అని యడిగెను.

నేను కిట్టమ్మను — అని చిలుక బదులుచెప్పెను.

నీ యజమానుడెవరు?

పిచ్చన్న.

నీవు ఎక్కడినుండి వచ్చినావు?

నెల్లూరునుండి.

ఎవరు తీసికొనివచ్చినారు?

నాగ్రహపాటు.

వేటకాడు తనరొట్టె చేతిలోపడెనని సంతసించి కిట్టమ్మను పిచ్చన్న వద్దికి గొనిపోయెను. పిచ్చన్నయు పునఃప్రాణములువచ్చినవాడై నూరు వరాలు చెల్లించి తనముద్దుకీరమును గొనియెను.

---

## ర్యైలు మించిపోయినది.

ఒకనాటి యుదయమున కంభంమెట్టు రైలుస్టేసనులో నొక నడువయసు పురుషుడు కడు గడబిడపడుచు నిటునటు పరుగెత్తుచుంచుట గని యొక పోలీసు బంట్రోతు అతనియొద్దికిబోయి — "అయ్యో! యేల యిట్లు త్రొక్కులాటపడుచున్నారు? ఏమయిన పోగొట్టుకొంటిరా? నాతో జెప్పిన నాచేతనైన సాయముచేయుదును — అని వినయపూర్వకముగా బలికెను. దానికాతడు —

సాయమా! హుం! ఆపోయిన 8 గంటలబండిని వెనుకకు బిలిపించగలిగిన నాకు సాయముచేయుదువు. నిశ్చయముగా, ఈ దినము పది నిమిషములుముందుగా ఆబండి బయలుదేరెను. ఎంతమాత్రము సందేహములేదు.

మరియొక బండిమీద మీరు పోగూడదా?

అదే ఆలోచించుచున్నాను. కాని, సాయంత్రము 5 గంటవరకు బండిలేదు. 6 గంటలకు నేను గుంటూరులో నుండవలయును గనుక ఆ బండి పనికిరాదు.

అంత అవసరపుపనియైన నొకటెలిగ్రాము పంపగూడదా?

ఒకటిగాదు నాలుగు పంపితిని. ఏమిప్రయోజనము? 6 గంటలకు వివాహము. పెండ్లికూతురికియ్యవలసిన కట్నములుకూడ నావద్ద నేవున్నవి.

ఇంతేనా! పెండ్లిఆగదుగద! కట్నములు రేపటిదినమియ్యవచ్చును. ఇంతలో మునిగిపోవునదే మున్నది?

పెండ్లి ఆగదా! ఎట్లా అవుతుంది? వచ్చిన చిక్కే అది.

అదేమి అట్లా అంటారు?

అది యేమా? పెండ్లికొడుకునే నేను. నీకు పదవేల సలాములు గాని అవతలకు పో! నాపాట్లు నేను పడుతాను.

---

## పిల్లలమాటలు.

ఉపాధ్యాయులు— (ఆరేండ్ల పిల్లవానిని)— అయిదూ, రెండూ, ఎంత?

పిల్లవాడు బదులు చెప్పక యూరకుండెను.

ఉపా॥ — మంచిది, నేడు నీకు అయిదు గోలీకాయలిస్తాను, రేపు రెండిస్తాను - నీవద్ద అన్నీ యెన్ని గోలీలుంటవి?

పిల్ల॥ — పది యని వెంటనే జవాబు చెప్పెను.

ఉపా॥ — పదిగోలీలా! అది యెట్లాగోయి?

పిల్ల॥ — నాదగ్గిర యిదివరకే మూడు గోలీలున్నాయిగా!

---

తోటవాడు — (చెట్టెక్కి పండ్లుగోసి కొనుచున్న యొక చిన్నపిల్లవానిని జూచి)—ఇప్పుడు చెట్టుదిగి రాకపోతివా చూడు, కుక్కను గొలుసు విప్పి వదిలి పెట్టిపోతాను.

పిల్లవాడు — ఓం! కుక్క చెట్టెక్కగలునా యేమిటి!

తోటవాడు — ఎక్కలేకపోతే యేమి, చెట్టుకింద వుంటుంది.

పిల్లవాడు తక్షణము దిగివచ్చెను.

---

ఒక పెద్దమనిషి ఆరేండ్ల బుడుతనిగని "ఏమోయి చిట్టిపంతులు! ఏమిటి మీ యింట్లో విశేషము!" అని యడిగెను. "ఏంలేలు - చిన్న తమ్ముణ్ని తెచ్చాలు" — అని బుడుతడు బదులు చెప్పెను.

"అట్లాగా! అయితే నీకు సంతోషమేగా?"

"ఛీఛీ — మంచితమ్ములు కాలు — ఎప్పాలూ ఏలుస్తాలు!"

"అయితే మళ్లా యిచ్చివేయండి."

"ఆc! మూన్నాళ్లుంచుకొని పాతది త్తే పుత్తుకుంతాలాయేంతి?"

## టపాసులు.

మీసాలపిచ్చన్న మిఠాయి దుకాణమువద్దికిబోయి అరవీసెడు పకోడీలిమ్మని యడుగగా దుకాణదారు తూచి పొట్లము కట్టియిచ్చి అర్ధరూపాయ అని వెల తెలిపెను. పిచ్చన్న తన చొక్కాయ జేబునుండి పది రూపాయలనోటు తీసి చేతికియ్యబోగా దుకాణదారు, "చిల్లర లేదండీ - రేపు యీ దారిని పొయ్యేటప్పుడు తెచ్చియివ్వండి" అని చెప్పెను. పిచ్చన్న దుస్తులును మీసాలబాగునుజూచి యితడెవరో పెద్ద మనిషి అని దుకాణదారు తలచెను. పిచ్చన్న కొంతదూరము పోయి దారిలో తన బోగముస్నేహితు డెదుర్పడగా — "ఓయీ, డబ్బియ్యకుండా మిఠాయి తెచ్చుకునే వుపాయము చెపుతాను, పోయి తెస్తావా?" అని యడుగగా వరదడు వల్లెయనియెను. "ఇదిగో యీనోటు తీసికొని అంగడికిపోయి ఒకవీసెడు పంచదార మిఠాయి తీసికొనిరా - అంగడివానివద్ద చిల్లర లేదు, రేపుతెచ్చియిమ్మని చెప్పును" అని యతడు జేబునుండి నోటుతీసి వరదడిచేతి కిచ్చెను. వరదడును వడివడిగ దుకాణముకడకు బోయి వీసెడు పంచదార మిఠాయి తూపించి పుచ్చుకొని నోటు అంగడివాని కందియ్యగా, "ఇప్పటి లెక్క రెండు రూపాయలు, పాతబాకీ అయిదు రూపాయలు - ఏడు రూపాయలు పోగా, యిదిగో మిగతా సొమ్ము" అని మూడు రూపాయలు వరదడిచేత బెట్టెను.



---

రామారావు — ఇవాళ్ళ యేమో విచారంగా వున్నా రెందుకు?

నాగయ్య — ఒక్కటేవిచారం - వద్దన్నకొద్దీ మాఆవిడ యాభయిరూపాయలు కుమ్మరించి నిన్న ఆముండాకొడుకు తెచ్చిన కొరనాడు చీర కొనుక్కొన్నది.

రామారావు — అల్లాగా! అయితే నేను రెండింతలు విచారపడవలెను.

నాగయ్య — ఏం అల్లా సెలవిచ్చారు?

రామారావు — మా ఆవిడ నూరురూపాయల చీర బేరము చేసింది — మీ ఆవిడ కొన్నమాటవింటే ఇక వక్కనిముషమైనా వూరుకో

---

తోడనే, నీ వెక్కడ బేరము కుదరనిత్తువుపొమ్మని వెంకయ్యగారు సెలవిచ్చిరి.

అట్లాకాదు బాబూ! ఒకవెల అడిగిచూడండి, చాలామేలైన దుప్పట్లు, సరుకుచూచి అడగండి — అనివర్తకుడు వేడుకొనియెను.

వెల అడిగి యేమిప్రయోజనము? నీతో బేరము కుదురదు — అని వెంకయ్యగారనిరి.

అట్లా సెలవియ్యకండి బాబూ! ఒకవెల అడిగిచూడండి — అని వర్తకుడు మరల వేడికొనియెను.

నీసంగతి నాకు తెలుసునోయి, నీతో బేరము కుదురదు, యిదిగో రెండురూపాయలు పందెముకూడా కట్టుతాను — అని వెంకయ్యగారు రొండినుండి రెండురూపాయలుతీసి దూరముగా బెట్టెను.

మంచిది బాబూ! ఈ పందెము నాకుసమ్మతమే — అని యావర్తకుడు తనసంచినుండి రెండురూపాయలుదీసి యారూపాయలతో జేర్చెను.

అంతట, జత అర్ధరూపాయకిస్తావా అని వెంకయ్యగారు బేరమడిగిరి.

తీసికోండి బాబూ — అనిచెప్పి వెంటనే దుప్పట్లిచ్చివేసి యావర్తకుడు పందెపురూపాయలు నాల్గును దీసి తనసంచిలో వేసికొనియెను.

వెంకయ్యగారు తెల్లపోయిచూచెను. అదిగని వర్తకుడు — ఎందుకట్లాచూస్తారు? ఆజత అర్ధరూపాయకూడా చెయ్యదనుకున్నారా యేమిటి? పోనియ్యండి - పందెముపందెమే, బేరము బేరమే - యిష్టము లేకుంటే తెండి, దుప్పట్లిచ్చివేయండి — అని చేయిసాచెను.

వెంకయ్యగారు నవ్వుముఖము దెచ్చుకొని దుప్పట్ల జత యిచ్చివేసెను. వర్తకుడు దానినిగొని భుజముమీద వేసికొని — పోనిండు, మీకు ప్రాప్తిలేదు — అని చెప్పి, "దుప్పట్లు! సీమదుప్పట్లు! డబ్బిల్ వోవుదుప్పట్లు!" — అని యరచుచు తనదారిని పోయెను.

---

## కురూపి కోటయ్యశాస్త్రి.

కురూపి కోటయ్యశాస్త్రికి కోరికలు మెండుగానుండెను. నిరక్షరకుక్షియయ్యు దనకు గొప్పయుద్యోగము లభింపవలెనని స్నేహితులతో చెప్పుచుండెను. తలిదండ్రులు అందగుపిల్లలను గుదిర్చి పెండ్లిసేయ ప్రయ

త్నించినను వారు చక్కనివారుకారనియతడు పెండ్లిమానుకొనియెను. ఒకనాటి యుదయమున నతని స్నేహితుడు తమయూరిలో నొక్క మిక్కిలి చక్కదనముగల చిన్నది కలదని తెలిపి యాచిన్నదానిని బెండ్లియాడుమని చెప్పగా — ఆచిన్నది చదువుకొన్నదేనా? — అని కోటయ్య యడిగెను. భారతమంతయు గడగడ వప్పగించగలదని స్నేహితుడు జవాబు చెప్పెను. పాటపాడునాయని యడుగగా ఆచిన్నదాని వంశమునందు పాటరానివారేలేరని స్నేహితుడు చెప్పెను. అదంతా సరేగాని ఆచిన్నదానిముఖము ఎల్లప్పుడూ నవ్వుతూవుండవలెనని కోటయ్య తనకోరిక తెలిపెను. ఆసంగతి నేను చెప్పజాలను, నిన్నుచూచి నప్పుడాచిన్నదాని ముఖము నవ్వుచుండునో యేడ్చుచుండునో యెట్లు చెప్పుదునని స్నేహితుడు సంభాషణము ముగించెను.

---

## చమత్కారములు.

రామయ్య — "భీమయ్యా! నీజేబులో ఎన్నిరూపాయలున్నవో చూడకుండా చెప్పతాను, తమాషాచూస్తావా? రెండణాలు పందెము" — అని రెండు అణాలుతీసి బల్లమీదనుంచెను.

భీమయ్య — "సరే, వప్పుకున్నాను" — అని తానుగూడ రెండణా తీసి రామయ్యయుంచిన రెండణాలతో చేర్చెను.

రామయ్య — "మంచిది! నేనవతలికి తిరుగుతాను, నీకుడిజేబ రూపాయలన్నీ తెలియకుండా లెక్కపెట్టి యెడమజేబులో వుంచు"

భీమయ్య — "అయింది."

రామయ్య — "మంచిది! రూపాయలన్నీ నీరెండుచేతులలో న కొని చేతులు గట్టిగా మూసుకో."

భీమయ్య — "మూసుకున్నాను."

రామయ్య — "మంచిది! నీజేబులో వక్కరూపాయకూడాలే పందెము గెలిచితిని" — అని బల్లమీదనున్న నాల్గణాలును తీ జేబులో వేసికొనెను.

---

మేజమీద ఒకరూపాయయుంచి—ఇదిగో యీరూపాయిమీ పుస్తకము పెట్టుచున్నాను, పుస్తకము తాకకుండ రూపాయి

వాడు రొట్టె తెచ్చి యియ్యగా— ఇదివద్దు, ఒకగిన్నెడు కాఫీయిప్పించండి — అని యాపిల్లవాడు రొట్టెనిచ్చి వేసెను. కాఫీ తెచ్చి యియ్యగా త్రాగి వందేమాతరం అని యుచ్చరించి వీరప్ప వెళ్లిపోవుచుండెను. అప్పుడు అంగడివాడు — " ఇది యేమి కాఫీకి అణాయియ్యకుండానే వెళ్లుచున్నావు ?" అని యరచెను.

" కాఫీకి బదులురొట్టె యిస్తినిగా !" — అని పిల్లవాడు బదులు చెప్పెను.

" పిచ్చివానివలెనున్నావు ? రొట్టెకు డబ్బెక్కడిస్తివి ?" — అని అంగడివాడు కోపముతో పలికెను.

" రొట్టె నేను పుచ్చుకోందే డబ్బెందుకియ్యమంటావు ?" — అని పలికి నదురుబెదురులేక పిల్లవాడు వందేమాతరం అని యుచ్చరించెను.

అంగడివాడు తెల్లపోయిచూచి వందేమాతరం పసందుగానే యున్నదనితలచి, కోపమువిడిచి యాపిల్లవానిని గని— " వందేమాతరం చాలా బాగానేవున్నదిగాని, యీవీథిచివర వెంకట్రాయుడి అంగడికిపోయి యీ తంత్రము అక్కడచేస్తివా నిన్నుడబ్బడుగను, పైగా ఒకణాడబ్బులు కూడా యిస్తాను, చేస్తావా ?" — అని యడిగెను.

" చేస్తాను, తే" అని పిల్లవాడు చేరువకువచ్చి చేయిసాచెను

అంగడివాడు అణాయియ్యగా వందేమాతరం అని యుచ్చరించి జేబులో వేసికొని పది అడుగుల దూరముపోయి, యాపిల్లవాడు వెనుకకు తిరిగి — " వెంకట్రాయుడిదగ్గిర ఒకణా పుచ్చుకొనే యీ తమాషా యిక్కడచేశాను" — అని యరచి, వందేమాతరం అని యుచ్చరించుచు వడివడిగ వెడలిపోయెను.

---

## జిత్తులమారి జంబుకము.

పెక్కుపక్షులు గుమిగూడియున్న యొకవృక్షము చెంతకుజని యొకజంబుకము — రండి, దిగిరండి ! మీకందరికొక మంచివార్త తెచ్చితిని. ఈ యరణ్యములోని జంతువులెల్ల నిన్న సభచేసి యికమీద నందరు నొండొరులతో మైత్రిగలిగి ప్రవర్తించునట్లు నియామకము చేసికొన్నవి. రండు, క్రిందికి రండు, మనమెల్లరము వేడుకగ నాడుకొందము — అని యెంతో

స్నేహభావము మీరునట్లు పలికెను. అప్పుడొక ముసలిపక్షి తలయెత్తి దూరముగాచూచి భయపడునట్లు నటించెను. ఏల భయపడుచున్నావని జంబుకమడుగ, అవిగో ఆవచ్చుచున్న వేటకుక్కలను జూడ భయమొదవు చున్నది అని పక్షిరాయడు బదులుచెప్పెను. ఆమాట విని జంబుకము కాలుసాగింపగా, ఏలపోవుచున్నావు! జంతువులకెల్ల సంధి జరిగెనని చెప్పితివిగదా యని పక్షి యడిగెను. సంధిమాట ఆవేటకుక్కలకు దెలియక యుండనోపు — నని పలికి జంబుకము పారిపోయెను.

---

## టపాసులు.

ఎనుబది యేండ్లముసలివాడు సంతతిలేక పన్నెండేండ్ల బాలికను



పెండ్లియాడెను. అదృష్టవశమున నతనికి మరి నాల్గేండ్లకు చక్కనిపుత్రుడు పుట్టగా నిరుగు పొరుగువారందరు నన్నివిషయములలో తండ్రి పోలికయే యని యాబిడ్డను కొనియాడిరి. ఆ మాటలు విని యాముసలివాడు నవ్వుచు — "నిజమే, నాపోలికమాట నిజమే. బిడ్డకు పండ్లులేవు, నాకును లేవుగదా!" — యని బదులు చెప్పెను.

---

జడ్జిగారు — నేరస్థుని వంకజూచి — ఎందుకు ఆలాగు ఊరక యేడ్చు చున్నావు?

నేరస్థుడు — చిత్తము! నేనెప్పుడూ జెయిలుచూచి యెరుగను.

జడ్జిగారు — ఇదిగో యిప్పుడు చూతువుగాని, నీకు రెండుసంవత్సరములు కఠినఖైదు విధించితిని.

నేరస్థుని దుఃఖమంతటిలో నిలిచిపోయెను.

---

రాజారావు — "ఏమోయి వెంకట్రావు! నీకు బొత్తిగా క్రిందుమీదు తెలియకుండా వున్నట్టున్నది మొన్నటిదినము నన్నుగాడిదె అని దూషించినావట నిజమేనా?"

వెంకట్రావు — "అన్నమాట నిజమే."

రాజారావు — ఎందుకన్నావు? క్షమాపణగోరుతావా, కోరవా?

వెంకట్రావు — కోరవలసిందే, కోరుతాను.

రాజారావు — మఱి కోరవేమి?

వెంకట్రావు — గాడిదె కనుపడగానే తప్పకుండా క్షమాపణ అడుగుతాను.

---

భర్త — "నీవు ఏదడిగితే అది తెచ్చి పెట్టుతూవున్నానా లేదా? పోయిననెలలో కమ్మలుకొని పెట్టితిని, ఈనెలలో చీరెకొంటిని. నీవు అందముగా కనుపడితే నాకు సంతోషముకాదా?"

భార్య — "మీరుమాత్రము అందముగా కనిపడితే నాకు సంతోషముకాదా యేమిటి? ఆచిరిగిపోయిన వుత్తరీయమే వేసుకొకపోతే, నాచేతికిస్తే కుట్టిపెట్టనా? అంతకంటె యెక్కువపని యేమున్నది?"

భర్త చాలా సంతోషించెను.

---

సూర్యుడుమంచివాడా చంద్రుడుమంచివాడా అని యిద్దరు చిన్నపిల్లలు వివాదమాడిరి. సూర్యుడేమంచివాడని చిన్నయ్యచెప్పెను. ఎందుచేతనని కన్నయ్యప్రశ్న వేసెను.

చిన్నయ్య — సూర్యుడువెలుతురూ ఎండాకూడా యిస్తున్నాడు. ఎండలేకపోతే బట్టలెట్లా యెండుతవి?

కన్నయ్య — సూర్యుడికంటె చంద్రుడే మంచివాడు.

చిన్నయ్య — అది యెట్లాగేమిటి?

కన్నయ్య — పట్టపగలు వెలుతురెవరికి కావలెను? రాత్రిళ్లు చీకటి సమయములో వెలుతురిస్తాడు గనుక చంద్రుడే మంచివాడు.

---

ఒక దినములో ఎన్నిపాఠములు చదువవచ్చునని ఒకపిల్లవాని తండ్రి ఉపాధ్యాయుని అడిగెను. ఉపాధ్యాయుడు — "పిల్లవాడు మంచి తెలివిగలవాడైతే ఒకపాఠము చదువగలడు, మధ్యస్థపు తెలివివాడైతే రెండు పాఠములు చదువగలడు, వట్టి తెలివితక్కువవాడైతే మూడు, నాల్గు, అయిదు పాఠములుగూడ చదువగలడు — అని జవాబు చెప్పెనట.

---

అప్పులవాడు — నాకియ్యవలసినబాకీ యెగబెట్టితివా వచ్చేజన్మలో నైనా తీర్చుకోకతప్పదు - ఈమాట బాగా నమ్ము.

బాకీదారుడు — "ఒకవేళ ముందటిజన్మలో నాకు నీవు బాకీవుండి యిప్పుడు తీర్చుకున్నావేమో ?

---

ఇద్దరు పిల్లవాండ్రుకలిసి సికారుపోవుచుండగా నొకడు రెండవవాని నడిగెను — "మొన్నటిదినము స్వాములవారిమీద రాళ్లురువ్వినవారిని పట్టుకొని జెయిలులోపెట్టియుంటే యిప్పుడు నీవెక్కడనుందువు ? దానికి రెండవ పిల్లవాడు — ఒంటరిగా సికారు పోవుచుందును — అని జవాబు చెప్పెను.

---

## 150 సంవత్సరముల క్రిందటి అన్న.

ఒకజమీందారీవ్యాజ్యము విచారణలో నొకవృద్ధుడు సాక్ష్యమిచ్చుచుండగా — "నీకు అన్నలుగాని అక్కలుగాని యెవరైననుండిరా ? — అని లాయరుగారు ప్రశ్న వేసిరి. "అక్కలు లేరు, అన్న మాత్ర మొక్కడుండెను — అని ముసలయ్య జవాబుచెప్పెను.

లా॥ — అతడిప్పుడు జీవించియున్నాడా ?

ము॥ — "లేదు, మృతిచెందెను.

లా॥ — ఎంత కాలముక్రిందట మృతిచెందెను ?

ము॥ — ఎంత కాలమా ? చెపుతాను. నల్బై, యిర్వై, తొంబై — నూటయాభై సంవత్సరములక్రిందట మృతిచెందెను.

లా॥ — "నేను అడిగినది తిన్నగావిన్నావా ? మీయన్న మృతిచెంది ఎన్ని సంవత్సరములైనది ?

ము॥ — చెప్పితినే, నూటయాభై సంవత్సరములైనది.

సాక్షి యీమాటచెప్పగానే కోపమువచ్చి, ఆకతాయతనముగా జవాబులు చెప్పినయెడల నిన్ను జెయిలుకు పంపింతును, భద్రము ! అని జడ్జీగారు బెదరించిరి.

మహాప్రభూ ! మన్నించవలయును. నేను ఆకతాయతనముగా జవాబులు చెప్పువాడనుగాను. నేను చెప్పినది వాస్తవము. నా అన్న మృతి

చెంది నూటయాభై సంవత్సరములైనది. సెలవైన తెలియజెప్పెదనను అని ముసలయ్య మనవిచేసికొనియెను.

జడ్జిగారు — నూటయాభయి సంవత్సరములా!

ము॥ — చిత్తము, నూటయాభయి సంవత్సరములే. మాతండ్రిగారికి ఇరువైయేండ్ల ప్రాయమున ప్రధమభార్యవలన నొకపుత్రుడుపుట్టి మూడు నెలలు పెరిగి మృతిచెందెను. పిమ్మట పదిమాసములకు భార్య మృతి చెందెను. రెండవ వివాహమునకు మాతండ్రిగారికి సంతానమే కలుగదయ్యెను. కాని అరువైయేండ్లవయసున ఆయన మూడవ భార్యను వివాహమాడగా మరి యిరవైయేండ్లకు నేను జన్మించితిని. నాకిప్పుడు తొంబైయేండ్లు నిండినవి. చూచితిరా, మా అన్నగారు మృతిచెంది నలభై, యిరవై, తొంభై — నూటయాభైయేండ్లయినది.

జడ్జిగారు ముసలయ్యను క్షమాపణ వేడికొనిరి.

---

## నేనింకా పుట్టనేలేదు.

కొందరు నవనాగరిక స్త్రీలుమీటింగుచేసి ఉపన్యాసము జరిపి పిమ్మట నొండొరులతో వేడుకగా మాట్లాడుకొనుచుండు కాలమున సుభద్రమ్మయను సుందరి పంకజమ్మను నీవయసెంతయని యడిగెను. నావయసు పదునాల్గని చెప్పి పంకజము నీకెన్నేండ్లని సుభద్రమ్మనడిగెను. నాకు మొన్ననే యిరువది నిండినవని సుభద్ర బదులుచెప్పెను. అంత నందరు నొండొరుల వయసులడిగి తెలిసికొనసాగిరి. ఆతరుణమున సత్యవతియను సతీమణి సింగారమను చిన్నదాని వయసడుగ — ఇప్పటిలెక్క చొప్పున నేనింకా పుట్టనే లేదు — అనియాబాలిక బదులు చెప్పెను.

---

## సృష్టి విచిత్రములు.

భగవత్సృష్టివిచిత్రములనించుక పరికించిచూచినచో మనమెంత మనబ్రదుకెంత మనము నివసించియుండు భూమండల మెంతయని యెట్టివానికిని దోచకమానదు. వింటిరా, చిన్న బింబముగ మనకన్నులకగుపడు సూర్యుడు ఎంతగొప్పవాడో యెంతదూరమునందున్నాడో! మనభూమండలమువంటి గోళములు సుమారు పదునాల్గులక్షల గోళములుచేర్చి యొ

క్కాలె గోళముగ జేసినచో సూర్యమండలముయొక్క ప్రమాణమేర్పడు నట! ఇంత పెద్దదయ్యును అతిదూరమునందుండుటచే మనకన్నులకు సూర్యుడు చిన్న బింబముగ గన్పట్టుచున్నాడు. ఆదూరము సంగతి వినుండు — అది తొమ్మిదికోట్లమైళ్లకు పైబడియున్నది. అహర్నిశలయం దేచ్చోనాగక విరామము లేక పోయినచో గంటకు 30 మైళ్ల వేగమున బోవు మనరైలుబండి 350 సంవత్సరములలో సూర్యునివద్దికి బోయిచే రును. 350 సంవత్సరములనగా నెన్నిదినములో యెన్నిగంటలలో లెక్కచూచుకొనుడు! నిముసమునకు కోటిమైళ్లకంటె నెక్కుడుదూ రముపరువిడునట్టి కాంతికిరణములు సూర్యబింబమునుండి బయలు వెడలి భూమండలమును జేరుటకు సుమారు 8 నిముసములు పట్టుచున్నది. చంద్రమండలము సూర్యమండలమంత దూరమున లేదు. అదిసూర్య మండలముకంటె చాలచిన్నది. పైనచెప్పిన రైలుబండి యిచ్చటినుండి చంద్రమండలమునకు ఒక సంవత్సరకాలములో జేరగలదు.

సాధారణముగా మనకన్నులకగుపడు నక్షత్రములు సుమారు 6 వేలు. మంచి దూరదృష్టియంత్రముతో జూచినచో 500 000,000,000 కను పడునట. ఈనక్షత్రములలో ననేకము సూర్యునికంటెను చాలరెట్లు పెద్దవి. కాని, అత్యధిక దూరమునందుండుటవలన మనకన్నులకు చిన్ని చుక్కలుగా గన్పట్టుచున్నవి. సూర్యునివెలుగు భూమండలము చేరు టకు 8 నిముసముల కాలముపట్టునని కదా పైనజెప్పితిమి — అదియు నిముసమునకు కోటిమైళ్లు మించిన వేగముతో పరువిడుచు సుమీ! అదే వేగముతో పరువిడుచున్నను కొన్ని నక్షత్రముల వెలుగు మన భూమం ముచేరుటకు 8 నిముసములుకాదు, 8 గంటలుకాదు, 8 దినములుకాదు, 8 నెలలుకాదు, 3 సంవత్సరముల కాలము పట్టుచున్నదట! లెక్కచూచు కొనండి, ఆనక్షత్రములు మనకు 9 కోట్లమైళ్ల దూరమునందున్న సూర్య మండలముకంటెగూడ ఎన్నిలక్షలరెట్లు దూరమునందున్నవో, ఎన్నిలక్షల రెట్లు పెద్దవో! ఇవి మొదటితరగతి నక్షత్రములు — 18 కలవట. వీని కంటెను పెద్దవియు దూరమునందున్నవియు రెండవతరగతి నక్షత్ర ములు - 55 కలవు. వీని వెలుగు మనభూమండలము చేరుటకు 6 సంవ త్సరములు పట్టుచున్నది. వీనికంటె పెద్దవి మూడవతరగతి నక్షత్ర

ములు - 170 కలవు. వీని వెలుగు మనకుచేరుటకు 9 సంవత్సరములకు పైగా పట్టుచున్నది. నాల్గవతరగతి నక్షత్రములు 500 కలవు-వీని వెలుగు భూమండలముచేరుటకు 12 సంవత్సరములు పట్టుచున్నది. ఆరవతరగతి నక్షత్రముల వెలుగు మనకుచేరుటకు 36 సం॥ లు పట్టుచున్నది. పదిమూడవతరగతి నక్షత్రముల వెలుగు మనకుచేరుటకు 2700 సంవత్సరములు పట్టుచున్నదట. ఇట్టివి దూరదృష్టియంత్ర సహాయమువలన 4 కోట్లకుపైగా కనుపడియున్నవి. తలచుకొని చూడుండు! మనభూమండలమునకు 9 కోట్లమైళ్లదూరమునుండు సూర్యునివెలుతురు మనకు 8 నిముసములకాలములో చేరుచున్నదిగదా, 8 నిముసములకు బదులు 2700 సంవత్సరములను పరువిడినంగాని యిచ్చటికి వెలుగు చేరజాలని మహానక్షత్రములు సూర్యునికంటెను ఎన్ని కోట్లకోట్ల కోట్ల కోట్లరెట్లు దూరమునందుండవలెనో, ఎన్ని కోట్లకోట్ల కోట్లరెట్లుపెద్దవిగా నుండవలెనో! ఇది దూరదృష్టి యంత్రమువలన నిజముగా కనిపెట్టబడిన నక్షత్రములమాట సుమీ. వానిని నక్షత్రములనరాదు - మహా మహా మహా సూర్యమండలములని చెప్పవలెను. అట్టివి 4 కోట్లకుపైగా నున్నవట. అంతకంటెను గొప్ప నక్షత్రములు — మహామహామహామహామహా సూర్యులున్నట్టును వానివెలుగు సృష్టిప్రారంభమున బయలువెడలి పరువిడుచున్నను గడపవద్దనే యున్నదనియు, ఇంక ననేక కోటికోటికోటికోటికోటికోటికోటికోటికోటికోటికోటికోటి శతాబ్దములు గడచినంగాని అది మన భూమండలమును చేరజాలదనియు జ్యోతిశ్శాస్త్రివేత్త లూహించుచున్నారు! అద్దిరా! యెంతటి యాశ్చర్యము!

ఈమహాసృష్టిలో నరుడెంతటివాడు! మనజ్ఞానమెంతటిది! మనబ్రదుకెంతటిది! మనము జీవించుకాలమెంత! ఇట్లుండియు నెందరు ఈజన్మమే సర్వమనియు ఎందరు తమ సుఖమే ప్రధానమనియు, ఎందరు తమకే సమస్తము తెలియుననియు, తమకు తెలియనిది హుళ్లిక్కి-యనియు, ఎందరు -అయ్యోయ్యో యెందరు — మిట్టిపడుచున్నారు! దేవుడేలేడని కొందరనుచున్నారు! భూలోకమేగాని యితరలోకములమాట కల్లయని కొందరు భావించుచున్నారు! నరులేగాని ఆత్మరూపములులేవని మరికొందరు వక్కాణించుచున్నారు! శ్రాద్ధములే వలదనుచున్నారు కొందరు, జం

దెములు త్రెంపివేయుచున్నారు కొందరు, స్వదేశము స్వరాజ్యమే సర్వమ్మని తలంచుచున్నారు కొందరు. అయ్యయ్యయ్యయ్యయ్యో! ఆత్మల కెట్టి దురవస్థయలవడియున్నది!

## శరీరసాధకము.

గోపాలశాస్త్రిగారు క్రొత్త "స్ప్రింగ్ డంబెల్సు" కొని తెప్పించి దడబిడలుగా సాధకము చేయుచుండుట గని, రామభట్టుగారు — ఏమండీ శాస్త్రులగారు! చాలా శ్రద్ధతో సాధకము చేయుచున్నట్లున్నది. స్వరాజ్య ప్రయత్నమా, అంతఃపుర విచారమా? — యని గూఢముగా ప్రశ్న చేసెను. శాస్త్రులుగారు నవ్వుచు — సాధకమువల్ల నెంతలాభమున్నదనుకున్నారు? నాసాధకమువల్లగాకున్న మొన్నటిరాత్రి చచ్చిపోయి యుందును — అని పలికెను. రామభట్టుగారు తెల్లపోయిచూచుచు — ఏమిటా సమాచారము? నేను విననేలేదే! — యని ఆశ్చర్యపడసాగెను.

మొన్నటిరాత్రి సముద్రతీరమున నేను వంటరిగా వచ్చుచుండగా — శాస్త్రులుగారు తెలియజెప్పెను — "ఒక సోల్జరు తప్పత్రాగి నన్ను కొట్టవచ్చెను.

ఓ! వానిని దిట్టముగా తన్నితిరా యేమి? — యని రామభట్టుగారడిగిరి.

తన్నితినా!

చంపివేసితిరా యేమి?

అంతదూరము మనకేల? — [శాస్త్రులవారు సందేహానివర్తిచేసిరి] — ఆసోల్జరు నన్నుపట్టుకొనరాగా ఒకటే పరుగునపరుగెత్తికొని యింటికి వచ్చిచేరితిని. సాధకముచేత నాకాళ్లకు బలముకలిగియుండుటవలన గదా నాప్రాణములు దక్కించుకొంటిని.

నిశ్చయము! నిశ్చయము! — అని రామభట్టుగారు లోలోన నవ్వుకొనిరి.

## ఏకాభిప్రాయము.

పిల్లలారా! — ఉపాధ్యాయుడు బోధింపసాగెను — దుష్టస్వభావమెన్నడును కూడదు. సాధుత్వము, దయ - యీగుణములు శ్లాఘ్యమైనవి. మీకు ఒక చిన్నకథ చెప్పెదవినుండు.

కో

“ రాముడును కృష్ణుడును చెరియొక కుక్కపిల్లను పెంచుచుండిరి. రెండును మిగుల చక్కనికుక్కపిల్లలే. కాని, రాముడు పెంచుచుండిన కుక్క త్రోవనుపోవువారినిగని యరచుచు వారిని కరవబోవుచుండును. మరియేదైన కుక్కపిల్లలుగాన్పించిన వానితో జగడమాడును. చుట్టు ప్రక్కలనుండు కోళ్లను పిల్లులను బ్రదుకనియ్యదు. ఒకతూరి పెద్దయావు మీదికెగిరి దానిముట్టె కరచినదట. బిచ్చగాండ్రును క్రొత్తమనుష్యులును ఆకుక్కపిల్ల సమీపమునకుబోవుటకు వెరతురు. కృష్ణునికుక్కపిల్ల యట్లుగాక సాధుస్వభావము గలదై యెల్లప్పుడు తన యజమానుని కాళ్లకడ నెమ్మదిగా బండుకొనియుండును. ఎవరు వచ్చినను తోకాడించుచు వారియొద్దికిబోయి యొడలునాకి యపేక్ష గనుపరచును. ఎవరిని గాని కరవదు, భయపెట్టదు. చిన్నపిల్లలు దానితో నాడుకొందురు. పిల్లలారా! యీరెండుకుక్కపిల్లలలో నేది మంచిది ? ”

పిల్లవాండ్రందరు నేకగ్రీవముగా నరచిరి — “ రాముని కుక్కపిల్ల ! రాముని కుక్కపిల్ల ! ”

---

## సత్యమూర్తి.

సత్యమూర్తిని తలిదండ్రులు చంద్రగిరికి చదువునిమిత్తము పంపుచు ప్రతివారము తప్పక యొకజాబువ్రాసి క్షేమసమాచారము తెలుపుచుండునట్లు మరిమరికోరిరి. తనముద్దు తనయుని దూరదేశము పంపలేక పంపుచు తల్లి యాతనిగడ్డముపట్టుకొని కన్నీరొలుక — నాయనా! మరచిపోక ప్రతివారమును జాబువ్రాయుమీ — యని బ్రతిమాలుకొనియెను. పిల్లవాడును వ్రాయుదునని గట్టిగా చెప్పెను. కాని యెన్నివారములు నెలలు గడచినను సత్యమూర్తివద్దినుండి జాబే రాదయ్యెను. అప్పుడు తలిదండ్రులకు గలిగినవిచారము చెప్పదరముగాదు. తండ్రి యెన్నిజాబులువ్రాసిన నొక్కదానికైన జవాబురాదయ్యెను. తల్లి రేయుంబవళ్లు తనయుని చింతతో కృశింపసాగెను. అంత ప్రాణమువిసిగి తండ్రియొక జాబువ్రాసి దానిలో ప్రత్యుత్తరమున కొకకాగితమును తన చిరునామాతో నొక కవరునుంచి పంపెను. పదిపండ్రెండ్రు దినములలో ఆకవరు తిరిగివచ్చెను, దానిలో పెన్సిలుతో వ్రాసిన జాబుండెను. “ నేను ఎన్ని

జాబులో వ్రాసితినిగాని మీరుచేర లేదని వ్రాసెదరు. కారణమేమో తెలియదు. నేనుపయోగించుచున్న సిరామంచిదిగాక కవరుమీది విలాసము మాసిపోవుటచేతనో చెరిగిపోవుటచేతనో నాజాబులు మీకు చేర లేదని తలచెదను. ఈజాబు పెన్సిలుతో వ్రాయుచున్నాను. ఇప్పుడు మీకు పంపిన కవరుమీది యక్షరములు నల్లగా ప్రకాశముగా నున్నవి. ఈసిరా యెక్కడిది? ఈజాబు తప్పక మీకు చేరునని నమ్మెదను. క్షేమముగానున్నాను." ఈజాబు చదువుకొని తలిందండ్రు లానందభరితులై మరుటపాలో విక్టోరియా డిపోవారి రాయల్ బ్లూబ్లాక్ ఇంకి పౌడర్ ఒకడబ్బీ తమకొమారునికి పంపిరి.

---

## టపాసులు.

ఒకనాటి మధ్యాహ్నము ప్రగల్భరాముడు మౌంటురోడ్డుమీదుగా బోవుచు నొకషాపులో నొకచక్కని దొరసానిని గని, యేదో కొనబోవునట్లు ఆషాపులో జొరబడి యిటునటు కొంతదడవు తిరిగి యాదొరసానికడకువచ్చి, యీషాపులో చిత్రములేమీలేవాయని యడిగెను. అల్లదిగో నీయెదురుగ నిలువుటద్దము కలదు, అచ్చటికిపోయి చూచుమని యాచిన్నది తక్షణము బదులుచెప్పెను.

---

పిల్లవాడు — తండ్రితో — "నాన్నా! మొన్న నేను తమ్ముణ్ణి కొడుతూవుంటే చెప్పలేదూ — నీకంటె చిన్నవాళ్లను కొట్టగూడదని?".

తండ్రి — "అవును, చెప్పాను."

పిల్లవాడు — "అయితే మరీ — మరీ — మా మేష్టరుగారికి వుత్తరం వ్రాసియ్యవూ? ఆయనకు ఆమాట తెలియనట్టుంది."

---

భర్త — నీకు నిశ్చయంగా నామీద అపేక్షవున్నదా? నిజముచెప్పు, నేనేమీ కోప్పడను. చిన్నపిల్లవు, మూడోపెండ్లి ముసలివానిమీద అపేక్షవుంటుందా యేమిటి?

భార్య — నా అపేక్షమాట కేమిగాని, నామీద వకరికి చాలా అపేక్ష వున్నది. మరీ రెండు నెలలబట్టి చెప్పతరముకాదు.

భర్త — తత్తరపడుచు — ఆఁ! ఆఁ! ఎవరికిచెప్పు — ఎవరికి, ఎవరికి?

భార్య — చెప్పుమన్నారా?

భర్త — చెప్పు, కోప్పడను, చెప్పు.

భార్య — మీకే!

భర్త — సంతోషముతో నుప్పొంగి తన చిన్న పెండ్లామును కౌగిట జేర్చుకొనెను.

---

చిన్నపిల్లవాడు — "మానాన్నకు కావలసినంతడబ్బుంది. షంగా వాలంటే అది కొని తెచ్చిపెటుతాడు."

చిన్నపిల్ల — "ఇంతేనాబాగ్గెం! మానాన్నదగ్గిలయెంత డబ్బుందను కున్నావేంటి? మా కక్కల్లేనివికూలా కొంతెచ్చిపెత్తుతాలు."

---

పంతులుగారు — "ఏమండీ శాస్త్రులుగారు! మీరు సిఫార్సుచేసిన వంటబ్రాహ్మణుడు మాప్రాణాలు తీసివేస్తూవున్నాడు. మొదటినెలలో వకమోస్తరుగా పనిచేశాడుగాని తర్వాత యెప్పుడుచూచినా మొఖం చిట్లించుకొని యేడుస్తూవున్నట్టుంటాడు. చెప్పిన ఆరునెలలకుగాని యే పనిచెయ్యడు. వట్టి టక్కరుముండాకొడుకుగా కనుపడుతాడు."

శాస్త్రులుగారు — "ఆమాటనిజమే — వాణ్ణి నమ్మనేకూడదు. దొంగ ముండాకొడుకు మీవద్ద పన్నెండురూపాయీలు జీతము యిప్పిస్తే నెలకు రెండురూపాయీలు నాకిస్తూవుంటానని వొప్పుకొని వకనెలమాత్రం యిచ్చాడు. తర్వాత యెప్పుడడిగినా యిదుగో అదుగో అని మాయ మాటలు చెప్పుతూవున్నాడు."

పంతులుగారు — "ఓహో! అల్లాగటండీ!"

---

గోవిందాచార్యులు గుంటూరుకు రైలుమార్గమున బోవుచు నొకపడుచు పిల్లయెక్కియుండిన బండిలోనెక్కి యెట్లయిన నాపిల్లతో మాట్లాడ వలెనని యామె కూర్చుండిన బెంచి కెదుటిబెంచిమీద నొకమాస పత్రిక యుండగా దానిమీదనే తటాలున చతికిలబడెను. అదిగని యాచిన్నది

వ్యసనపడుచున్నట్లుగాన్పింపగా, ఆచార్లు—అమ్మాయీ! యీ పత్రికనీదా?—యని యెడమచేతితో దానినిలాగి యాపిల్లకిచ్చివేసెను. కొంతసేపటికి మంగమ్మ మంగళగిరివద్దదిగి బండి మరల బయలు వెడలు నంతవరకును అచ్చటనే నిలిచియుండుటగని గోవిందాచార్యులు తనయెడ నాచిన్నది ప్రీతిగొనియున్నదికాదలచి తాదెచ్చికొన్న ఫలములు కొన్నియిచ్చి, చిట్టచివరకు నీపత్రిక తీసికొంటివిగదా యని యడిగెను. "ఆహా! తీసికొంటినిగాని, దానిక్రిందనున్న అల్వా అక్కడనేయున్నది"— అని చిన్నది బదులుచెప్పెను. ఆచార్లవారు లేచిచూడగా బల్లమీద అల్వా కనుపించలేదుగాని తానుకట్టుకొన్న వస్త్రమున కేదో అంటుకొనియున్నట్టు అనుమానముకలిగెను. ఇంతలోపల రైలుబండి పోవనారంభించినందున పిమ్మటి విషయము తెలియలేదు.

---

ఒకనాటి సాయంకాలము రాయపేటవద్ద ట్రాముబండిపోవుచుండగా మంచి విలువదుస్తులుధరించిన యొక మహమ్మదీయుడు చేయియెత్తి బండి ఆపుమని సంజ్ఞచేసెను. అంతట బండియాపగా నతడు తనజేబునుండి యొక నిప్పుపుల్లతీసి యాబండిమీదగీచి చుట్టవెలిగించుకొని, సరే యికపోవచ్చునని చెప్పి వెనుకకుతిరిగి పోసాగెను. బండితోలు పరంగిదొరగారు కడుగోపముతో వానినితిట్టి పట్టుకొనబోయెను గాని, వాడు తప్పత్రాగియున్నట్లు తెలిసికొని యాప్రయత్నమును విడిచిపెట్టెను.

---

రాజులు రాజులుగూడిన రవలు రాలునట. ఇది యేమివింత! ఈ మధ్య నొకరాజుగారు మరియొక రాజుగారికి విందుచేసి బజారులో గొనితెచ్చిన ప్రాతపూర్ణపు బూరెలువడ్డించి పావులా పావులా ఖరీదని తెలియజెప్పగా, మీబూరెలు మీరేవుంచుకొని అర్ధపావులా చొ॥ రొక్క మిప్పిస్తే సంతోషిస్తామని విందుకువచ్చినవారు చెప్పితీసికొనిరట!

---

మల్లప్ప—శుక్రవారము మధ్యాహ్నము నాకు శలవిప్పించవలెను— ఆనాడు మాబావగారిశవాన్ని తీసుకొనిపోయి దహనంచేస్తారు.

ఉపాధ్యాయుడు — ఆశ్చర్యముతో — శుక్రవారమా! ఏమిటోయి నేడు సోమవారముగదా, శుక్రవారమువరకూ ఎట్లా ఆవుతాదోయి?

మల్లప్ప — ఆపకబధి లేదు, మాబావ యింకా బ్రతికేవున్నాడాయెను.

ఉపాధ్యాయుడు — ఛీఛీ! యెంతక్రూరాత్ముడవు మల్లప్పా! నీమాటకు చాలా లజ్జపడుచున్నాను. ఎన్నడో చనిపోవునని అయిదారు దినములకు ముందుగానే సెలవడుగుచున్నావా? ఏవరుచూచినారు ఒక వేళ జీవించునేమో?

మల్లప్ప — జీవించడానికి వీలు లేదు. ఆవిషయమై సందేహమే లేదు.

ఉపాధ్యాయుడు — అది యెట్లా చెప్పవచ్చును? డాక్టర్లు నిశ్చయముగా బ్రదుకడని చెప్పినవారెందరో బ్రదికినారు. ఎవరిమాటో యెందుకు మానాయనగారు జీవిస్తాడని యెవరనుకున్నారు?

మల్లప్ప — అట్లా కాదండి. మాబావగారిని శుక్రవారం వుదయము వురితీస్తారు. ఆమధ్యాహ్నం శవాన్ని తీసుకుపోయి మావాళ్లు దహానం చేస్తారు.

---

## సరసాంగి.

సరసాంగియను వేశ్య రూపాయలు తాకనని వ్రతముచేసికొని సరసుల వద్ద సవరనులే పుచ్చుకొనుచు నాలుగువేలోకసంచినిండబోసి సీలుచేసి పెట్టెలోదాచిపెట్టెను. ఈమర్మ మొకచోరశిఖామణి తెలిసికొని యెట్లనో పదిసవరనులు గిలుచి యావారకాంతకు గానుకగా నొసంగి యాపెపొందున నొకరాత్రి నిద్రించెను. పిమ్మట గొన్నాళ్లకు జూచుకొనగా పెట్టెలో నాసంచిలేక యెవరు తస్కరించినదియు దెలిసికొనజాలక యావేశ్యనానాటికి కృశించి జీవచ్ఛవమయ్యెను. రసికజనులు నాపెను విడనాడ నాపె భుక్తిగడచుటయే కష్టముగానుండెను. అంతనాయింతి వేదాంతమవలంబించి గుద్దాకుతావళమెల్లప్పుడు చేతబట్టి త్రిప్పసాగెను. ఇట్లు కొన్నిమాసములు గడచినపిదప నొకనాడు తపాలవాడొక జాబు దెచ్చి యాపెచేతికందిచ్చెను. ఆజాబువిప్పిచూడగా నందు నూరురూపాయలనోటును ఒకచిన్నిచీటియు నుండెను. ఈచీటిలో నేముండెనో వింటిరా! — "సరసాంగీ! నీసవరనులసంచి తెచ్చుకొన్నది మొదలు నాదుర్వ్యాపారాసి యేకష్టము నెరుగక సుఖముగా జీవించుచున్నాను. కాని యీమధ్య నొకనాడు నీదుస్థితినిగన నామనస్సున మిక్కిలి ఖేదము

పుట్టినది. అందువల్ల ఈజాబులో నూరురూపాయలనోటు పెట్టి నీకు పంపు చున్నాను. తిరుగా నాకు వ్యసనముకలిగినప్పుడు ఇంకొక నూరు రూపాయలు పంపుదును. నీవ్యసనము మరచిపోయి సుఖముగా నుండవలెనని కోరుచున్నాను" — ఇట్లనియుండెను. ఆ నూరురూపాయల నోటు దీసికొని సరసాంగిపొందిన సంతోషమింతని చెప్పశక్యముగాదు ఎంద రెందరో సరసులిచ్చిన వేనవేలవరాలకన్న తస్కరుడిచ్చిన యీ నూరు రూప్యములవల్ల నాపెకత్యంతమగు సౌఖ్యమును జ్ఞానమును కలిగెనట. ఆర్బతునాటుకంపెనీలో పోగొట్టుకొన్న దాపుడుధనముకన్న చిట్టచివరకు చేతికిరాబోవు అణాలవల్ల నెందరికి జ్ఞానమును సౌఖ్యమును రానున్నదో యెవ్వరు చెప్పగలరు!

భగవత్సృష్టిలో నిరుపయోగమైనవస్తువుగాని కార్యముగాని కానంబడదు. తస్కరకృత్యములవల్ల తస్కరులకేకాక యితరులకుగూడ జ్ఞానమార్గమెట్లు లభించెడినో చూడుడు. దుష్టజంతువులును తేళ్లు పాములు మున్నగునవియు కార్యములేక యీ మహాసృష్టిలో జేరియుండునా? ఓహో! శ్రీ వేంకటేశా! యేమి నీ మహిమ!

## పార్వతమ్మగారి పంటినొప్పి.

శ్రీమతి పార్వతమ్మగారు రేయుంబవల్లు పంటినొప్పిలో బాధపడుచు ఎక్కడెక్కడి మందులను దెప్పించి యుపయోగించెను. కాని దేనివల్లను లేశమేని గుణముగాన్పింపక నానాటి కాపెశరీరము బలహీనస్థితిని బట్టుచుండెను. బొంబయి కలకత్తా మందులయందాపెకు విశ్వాసమే తప్పెను. జనులను మోసపుచ్చి డబ్బులాగుట కెందరెందరో దంబముగా నోటీసులు జారీచేసి యేమన్నో యింతకలిపి పంపుచున్నారనియు ప్రసిద్ధికెక్కిన పెద్దకంపెనీలలో పనిచేసిన నౌకర్లుగూడ మారుపేర్లతో క్రొత్తకంపెనీలుపెట్టి బూటకపు కేటలాగులవల్లను బహుమతులవల్లను జనుల నూరించి తమవలలలో బడవేసికొనుచున్నారనియు అభిప్రాయ మేర్పడియెను. ఎవరికెంతసొమ్ము గ్రుమ్మరించియు నేమిప్రయోజనము? ఎందరి నెంతదూషించి యేమిఫలము? పాపమాపె పంటిబాధ నానాటికి హెచ్చెనుగాని తగ్గినదికాదు. ఆపె బాధను గనికని భర్తయు నేపనియుదో

చక సదా ఖిన్నుఁడుగానుండెను. ఒకనాటిసాయంకాలమున వారిరువు రును మేడపైగూర్చుండి విచారపడుచుండగా నాలుగేండ్లునిండని వారి ముద్దుబిడ్డ యల్లన వారియొద్దికిజని, కష్టదీనభావముతో — "అమ్మా! అమ్మా! అది పీకెయ్యనా?" — యని తన చిట్టిచేయినాచెను. "ఓ యమ్మో!" యని కేకవేసి తల్లి యాబిడ్డనుచేరదీసి చెక్కిళులను జేతి తోఁడ ముద్దాడెను. తండ్రిమాత్ర మేదోక్రొత్తవిషయము కనిపెట్టిన వానివలె నుత్సాహముతో లేచి, "ఇంక నాలుగుగడియలలో నీ పంటి బాధయంతయు మాయమై పోవును భయపడకు" — మని తన యనుంగు సతికి ధైర్యముచెప్పెను. అది యెట్లని యాయమయడుగ — "ఎట్లా? యుందరనే చెప్పిరిగదా మన పంతులుగారు? — బూటకపు మందులనేల నమ్మెదరు, ఆపల్లు పీకివేయించినగాని బాధనివారణ కాజాలదని? నాకు నిప్పుడు జ్ఞప్తికి వచ్చినది, [illegible] అమ్మాయివలన నిప్పుడామాట జ్ఞప్తికి వచ్చినది, రమ్ము, పంటిడాక్టరువద్దికి పోవుదము రమ్ము. ఆయనకుచూపి అవసరమైన యెడల పల్లు తీసివేయింతము" — అని యతడు తెలియజెప్పెను.

"ఓయమ్మో!" యని భార్య మరల కేకవేసెను.

"అటుగాదు, నామాటవిను" మని భర్త బ్రతిమాలుకొనియెను.

అంత వారిరువురును బండియెక్కి పంటిడాక్టరుగారి యింటికిబోయిరి. డాక్టరుగారు పరీక్షించిచూచి యాపల్లు పుచ్చిపోయినదనియు దానిని తీసివేసినవెంటనే బాధ నివారణమగుననియు సెలవిచ్చిరి. కాని ప్రాణముపోయినను సరే పల్లు పీకించుకొనజాలనని పార్వతమ్మ పలికెను. ఏదోమందు రాచి లేశమును బాధలేకుండ దీసివేయుదునని డాక్టరుగా రెంత చెప్పినను భర్తయెంత బ్రతిమాలుకొన్నను ఎంతధైర్యము చెప్పినను ఆమె సమ్మతింపదయ్యెను.

అంత నేయుపాయమునుదోచక యతిరాయడు తనసతిని గని — ఎంత చెప్పినను వినకయున్నావుగదా, యిదిగో యిప్పుడు నీ కొరకై నేనొక పల్లుపీకించుకొని లేశమును నొప్పియుండదని నీకు నమ్మకము కలిగించెద — నని పలికి తనపల్లొకటి తీసివేయునట్లు డాక్టరుగారిని గోరి యచ్చట నమర్చి యుండు యంత్రపుకుర్చీలో గూర్చుండి వెనుక ప్రక్కకు తలయానించి నోరుదెఱచెను. డాక్టరుగారును ఆయుధపాణియైవచ్చి యతిరాజుల

శిరస్సు అటుయిటు కదలకుండ సరిచేసి ఒకచేతితో నాయుధముపట్టి పల్లుపీకుటకు సంసిద్ధులైరి.

అప్పుడు వద్దువద్దని కేకవేసి, తనపై భర్తకుగల ప్రేమమాధిక్యము నకు బెల్లు సంతసిల్లి, భర్తనులెమ్మని యాకుర్చీలో పార్వతమ్మగూర్చుండి కండ్లుమూసికొని నోరుతెరచెను. పాపమాయమ్మ యెంతధైర్యమవలంబించినను కాలుసేతులు గడగడ వడకసాగెను.

ఆమరునిముసమె డాక్టరుగారు పుప్పిపంటిని పీకివేసిరి. మరియొక గడియలో భాధయంతయుపోయి సౌఖ్యము కలిగెను.

ఈసమాచారము విన్న వెంకట్రావు పంతులుగారు — యతిరాజులుగారి పండ్లన్నియు పెట్టుడుపండ్లని పార్వతమ్మగారికి తెలియదు కాబోలు — నని పలుకగా, మహాలక్ష్మమ్మ స్వహస్తప్పి యాతనిపై బడియెను. అటుపిమ్మట వారిరువురి ప్రేమలు నెట్లు వర్ధిల్లెనో యెవ్వరు చెప్పగలరు?

---

శేషమ్మ — సుబ్బమ్మా! నీవు నాకంటె రెండింతలు పెద్దదానవుగదా, నిన్నొక్క చిక్కుప్రశ్న అడుగుతాను, విప్పూ, చూతాము.

సుబ్బమ్మ — నాపెద్దతనము పెటాకులైపోయింది. నీయుక్తి ముందర నే నెంతటిదానను? అయినా అడిగిచూడు. చేతనైతే చెపుతాను.

శేషమ్మ — మంచిది! నిన్న రేపయినప్పుడు నేటికి ఆదివార మెంత దూరముండెనో రేపునిన్నయినప్పుడు నేటికి శనివారము అంతేదూరముండును. నేడు ఏమివారము?

సుబ్బమ్మ యింకా ఆలోచించుచునే యున్నదట! మాచదువరులలో శేషమ్మకు జవాబు చెప్పగలవారెవ్వరు?

---

## నిద్రలో గురకకొట్టుట.

తనమగని గురక కుదుర్చుట కేమి యుపాయమని యొక నారీమణి యడుగగా, లండన్ నొక పత్రికాధిపతి — "సెనగగింజంత సబ్బు ముక్క చల్లగా అతని నోటిలో వేసినయెడల దానిచములుతో గొంతునరములు సడలి గురకమానును" — అని జవాబు ప్రచురించెను. ఈ యుపాయమువలన చాలమంది భార్యలకు సౌఖ్యము లభింపవచ్చుగాని, సబ్బు

పడుచుండిరి. ఇంతలో వారి దర్శనము నిమిత్తము రాజుశాస్త్రిగారు విజయంచేసిరి.

"తమపేరు రాజుశాస్త్రిగారా? మంచిది! తాము వచ్చినపని యేమయ్యుండును?" — అని కోటిలింగముగా రడిగిరి.

"చిత్తము! నాబంగారు గడియారము నిమిత్తము వచ్చితిని" — అని శాస్త్రులవారు తెలియజెప్పిరి.

"ఓ! అట్లాగా?" — అని లింగముగారు తమబల్లసొరుగునుండి గడియారముదీసి అదియును ప్రకటన ఖర్చులనిమిత్తము రూ. **30**లకు బిల్లును శాస్త్రులవారిచేత బెట్టిరి.

"ఓహో! యిది ప్రకటన ఖర్చులకుబిల్లా?" — యని పలికి, వెంటనే రెండు సవరనులు జేబునుండితీసి లింగముగారిచేత బెట్టి శాస్త్రులవారు సెలవుపుచ్చుకొనిరి.

లింగముగారు కడుసంతోషముతో నింకొక గిల్టుగడియారము తెచ్చి బల్లసొరుగులోనుంచి, యీపని చాల లాభకరముగా నున్నదని తలపోయుచు మరియొక శాస్త్రులవారికొర కెదురుచూచుచుండెను. కాని, మరి కొనిముషములలో పాపము! అతని సంతోషమెల్ల చల్లారిపోయెను. రులుతీసి చూచుకొనగా గిల్టు సవరనులని తేటపడియెను! "స్కాం ! ...నేమి చేయవచ్చు?" — నని రాజుశాస్త్రిని లింగముగారు ... చిరిటా!

## మామిడిపండ్ల పిల్లవాడు.

టియుదయమున నొకానొక పెద్దమనిషి కచేహరీకి బోవుచుండగా డిపండ్లమ్ముచున్న యొకపిల్లవా డెదురుపడియెను. "ఎట్లాయిస్తా" — అని పండ్లు పరీక్షించిచూ యాపెద్దమనిషి బేరమడుగగా — లరూపాయ కొకటి—ప్రశస్తమైన మల్గోవాలు, పదేపది వున్నవి, కొనండి" — అని పిల్లవాడు బదులుచెప్పె "ఆల్ రైట్" — యాపెద్దమనిషి యొకపండుతీసికొని చిల్లర నొకరూపాయ చేత బెట్టెను. ఆ పిల్లవాడు "చిల్లర లేదే" — యని పలికి, యీ పండ్లు చూస్తూవుండడి, యిదిగో వకనిముషములో తెస్తాను" —

అని ప్రక్కవీధిబజారుకు పరుగెత్తిపోయెను. కాని అయిదారు ములవరకు వాడు రాడయ్యెను. ఈ లోపల ఆత్రోవనుపోయి గుమాస్తాలు — "ఏమండోయి పంతులుగారు! మామిడిపండ్ల రములో దిగినట్టున్నది? కచెహరీమాని వేసి స్వదేశ వ్యాపారవ ట్టున్నది" — అని కేరడముసేయుచు బోవుటచే ఆ పెద్దమనిషికి వంపులుగానుండెను. ఆపండ్లపల్లిక అచ్చటవదిలిపెట్టి పోవుటకు లేకయుండెను. కచెహరీవేళయు సమీపించెను. ఇంతలో నాకి పరుగెత్తుకొనివచ్చి చిల్లర యందియ్యగా — "నీ గంపను నన్ను యుంచిపోతివా?" యని ఉద్యోగస్థుడు కోపగించుకొనియెను బూ! మీ రూపాయతీసుకొని పారిపోతిననుకుంటిరా? చిల్లర దొరికిందికాదు" — అని పిల్లవాడు తెలియజెప్పెను. "మంచి విలే! ఇంకొక్కనిముషము నీవురాకుంటె నేనువెళ్లి పొయ్యే" అని పంతులుగారు పలుకగా, "రెండు రూపాయల మామిడిప తామనుకున్నారా! మంచి పెద్దమనుష్యులే!" యని పిల్ల పొడిచెను. పంతులువారు బదులు చెప్పక గబగబ నడిచిపోయి

సంపూర్ణము.